2

PARLE




జాన్ లక్కీ ఫ్లేవర్
ఆలూ చాట్, దీన్ని తింటే,
వారి అదృష్టం రైట్.

Parle's Wafers
20% Extra
Aloo Chaat FLAVOUR




పార్లేస్ వేఫర్స్
తినడంలో మీ
ఫండా ఏమిటి?

Also available in Tangy Tomato, Classic Salted, Cream n' Onion, Masala Masti, Red Chilli Achaar.



www.chandamama.com/parle/

everest/PB/836-11 tel

# యువ విజేతలు

మీ కుటుంబంలో గాని, పొరుగున ఉన్న కుటుంబాలలో గాని ఎవరినయినా ఉదయతారగా ప్రతిపాదించాలని మీరు భావిస్తున్నారా? దయచేసి బాలబాలికల వివరాలు మరియు మీ ప్రతిపాదనలను మాకు పంపించండి:

Young Achievers-RCM,
Chandamama India Ltd,
No:2 Ground Floor, Swathi Enclave, Amman koil street, Vadapalani, Chennai-26
(or)
online@chandamama.com

## అద్భుత బాలుడు



మూడున్నర సంవత్సరాల వయసున్న సహజ్‌దీప్ సింగ్ కోహ్లి అసాధారణ జ్ఞాపకశక్తి కలిగిన అద్భుత బాలుడు. ఏ విషయాన్నయినా చాలా వేగంగా గ్రహిస్తుంటాడు. దాదాపు 105 దేశాల పతాకాలను కేవలం 52 సెకండ్లలో గుర్తుపడతాడు. ఇంత చిన్న వయస్సులోనే ఇతడు నాలుగు రికార్డులు సాధించాడు. వీటిలో మూడు జాతీయ రికార్డులు కాగా ఒకటి ఆసియా రికార్డు.

ప్రపంచంలో జరుగుతున్న అన్ని సంక్లిష్ట పరిణామాలను ఇతడు గడగడా చెప్పేస్తాడు. జాతీయ చిహ్నాలు, ఖండాలు, మహాసముద్రాలు, ప్రముఖ స్థలాలు, వ్యక్తులు, క్రీడాకారులు ఇతనికి అభిమాన అంశాలు.

భారతదేశంలోని రాష్ట్రాల రాజధానుల పేర్లను ఇతడు అతి తక్కువ సమయంలో వల్లించగలడు. ఇతడు కంప్యూటర్‌ను కూడా చక్కగా ఉపయోగించగలడు. సాధారణంగా సహజదీప్ వయసుగల పిల్లలు తమ చుట్టూ ఉన్న వస్తువులను గుర్తించడాన్ని మాత్రమే నేర్చుకుంటుంటారు. ఆ వయసులో పిల్లల భాష కూడా అంత మెరుగ్గా ఉండదు. కాని 10 వేల మంది ప్రముఖులు, అతిథుల సమక్షంలో కూడా ఈ బుడతడు భిన్నత్వంలో ఏకత్వం, జాతీయవాదం వంటి అంశాలపై ఉపన్యాసాలిస్తూ ఆకట్టుకుంటున్నాడు. నిజంగా ఇది అద్భుతమే. ఈ చిన్నారి బాలుడికి మంచి భవిష్యత్తు కలగాలని ఆశిద్దాము.



జనవరి 2012 ₹20/-
*Founded by* **B. Nagi Reddi and Chakrapani**

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar
**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju
**Sub Editor :**
Patricia Pandian
**General Manager :**
Sowmya Bharadwaj
**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar
**Artist :**
Venki
**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar
**Production In-charge :**
Prashant Pawar
**Circulation:**
circulation@chandamama.com
**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej
**Sales Officer - Circulation :**
K. Ravishankar
**Advertisement :**
sales@chandamama.com
**Subscription :**
Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828
**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
P.O.Box No:19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD., Published and Printed on their behalf by Prashant Sharad Muleker Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093. Printed At :- Kala Jyothi Process Pvt. Ltd. S.No.185, Kondapur, R.R.District-500133, Andhra Pradesh. Editor :- Prashant Sharad Mulekar

T

# ఈ సంచికలో ...

## చందమామ

Volume-3 January 2012 Issue-01

ప్రియమైన పాఠకులకు!!!

చందమామ పాఠకులందరికీ నూతన సంవత్సర శుభాకాంక్షలు! గత ఏడాది కంటే ఈ ఏడాది మరింత శుభకరంగా ఉంటుందనే విశ్వాసంతో, ఆశాభావంతో కొత్త సంవత్సరంలోకి అడుగుపెడుతున్నాము.

జనవరి 14న మకర సంక్రాంతిని జరుపుకుంటాము, శీతాకాలంలో భూమి తన అక్ష్యాన్ని మార్చుకునే ఘటనకు సంక్రాంతి ప్రతీకగా ఉంటుంది. దక్షిణాదిన మనం పంటల పండుగకు గుర్తుగా సంక్రాంతి జరుపుకుంటాము. ఈనెలలోనే మనం వసంత పంచమి సందర్భంగా జ్ఞాన, సంగీత, కళాదేవత అయిన సరస్వతిని పూజిస్తాము.

ప్రపంచవ్యాప్తంగా 2011 సంవత్సరం అన్ని రంగాల్లోను కల్లోలభరితంగానే ముగిసింది. ప్రపంచం మాంద్య పరిస్థితులను ఎదుర్కొంటున్న నేపథ్యంలో యూరప్ వాసులు దివాళాకు వ్యతిరేకంగా నిరసనలు తెలుపడం మనం చూశాము. మధ్య ప్రాచ్యంలో ప్రజాస్వామ్యం కోసం లక్షలాది ప్రజలు నినదించడం చూశాము. సునామీ, వరదల రూపంలో ప్రకృతి ఆగ్రహాన్ని కూడా మనం చవిచూశాము. అదే సమయంలో మనం క్రికెట్‌లో ప్రపంచ ఛాంపియన్స్‌గా నిలిచాము. తొలి సారిగా ఫార్ములా వన్ రేస్‌కి ఆతిథ్యమిచ్చాము. లంచగొండితనంపై తీవ్రమైన ప్రజాందోళనల తాకిడికి దేశం సాక్షీభూతంగా నిలిచింది కూడా.

ఒక జాతిగా, మనం కష్టాలను నిబ్బరంగా భరిస్తూ వస్తున్నాము. విదేశీ దండయాత్రల నుంచి సర్వకాలాల్లోను మన సంస్కృతి మనగలగడానికి కష్టాలను భరించే ఈ సహనభావమే కారణం. ఈ సంప్రదాయంలో భాగంగానే మనం జనవరి 26న రిపబ్లిక్ డేని జరుపుకుంటాము. మనలోని విభేదాలను పక్కనబెట్టి జాతి నిర్మాణం కోసం మనం తిరిగి సమీకృతం కావలిసిన అవసరముంది.

గత 64 సంవత్సరాలుగా మనం ఎంతో సాధించాము. కాని మనం సాధించవలసిన లక్ష్యాలు చాలానే ఉన్నాయి. మన ఆర్థిక స్థితి, పురోగతి ప్రాతిపదికన ప్రపంచ నేతగా ఆవిర్భవిస్తున్నాము. ప్రపంచం మనల్ని అనుసరించేలా చేయడానికి మనల్ని మనం నమూనాగా చూపించుకోవాలి. మంచి భవిష్యత్తుకోసం మనందరం పాటుపడదాము.

– సంపాదకులు





# పాఠకుల లేఖలు



నాకు ఇప్పుడు 65 సంవత్సరాలు కాని చందమామ పత్రికను చదివేటప్పుడు చిన్న పిల్లాడిలాగే సంతోషంలో మునిగి తేలుతుంటాను. ఈ దఫా సంస్కృత చందమామ చదువుతున్నప్పుడు అచ్చు తప్పులు కనిపించాయి. జాగ్రత్త వహించండి.

– అనంతరామ్, పుట్టపర్తి, అనంతపురం

నేను ఒరియా చందమామను గత ఆరు సంవత్సరాలుగా చదువుతున్నాను. ఆరేళ్ల క్రితం పత్రిక ఎలా ఉండేదో అలాగే ఇప్పుడూ కొనసాగుతోంది. బేతాళకథలు, జాతక కథలు, పంచతంత్ర కథలు అంటే నాకు చాలా ఇష్టం. దయచేసి రామాయణం సీరియల్, 25 సంవత్సరాల కథలను మళ్లీ ప్రచురించండి. – కీర్తి రంజన్ లెంక, కేంద్రపారా, ఒరిస్సా

భారతీయులందరికీ నిజాయితీతో ఈ సూచన చేస్తున్నాను. చందమామను మీ భాషలోనే చదివి దాన్ని జీర్ణం చేసుకోండి. నీతిని గ్రహించడానికి, మన వైభవోజ్వల గతాన్ని దర్శించేందుకు, మన ప్రాచీన రుషులు, మహర్షుల సనాతన వారసత్వాన్ని మన పిల్లలకు అర్థం చేయించి వారిని సరైన మార్గంలో పయనింపజేసేందుకు, దయచేసి చందమామను చదవండి, మీ పిల్లలచేత చదివించండి. ఈ మాసం ముఖచిత్రం ముచ్చటగొలిపే అమ్మాయి అబ్బాయి, కాసారంలో పడవ విహారం, క్షీరనీరన్యాయం చేసే రాజహంస, హరిత వాతావరణం అద్భుతం. నెహ్రూగారి సందేశ పునర్ముద్రణ అమోఘం. కథలు ఎక్కువగానే ఉన్నాయి. చిన్న కథలు నిమ్మతొనల్లా ఉన్నాయి.

– బి.రాజేశ్వరమూర్తి, చిలకలపూడి, బందరు, కృష్ణాజిల్లా

నవంబర్ సంచిక అక్టోబర్ 31నే అందించడం మహానందం. ఏ పత్రికలు కూడా ఇంత సకాలంలో పంపించడం చూసింది లేదు. చందమామ పత్రిక వాస్తవానికి దగ్గరగా పిల్లల మనస్తత్వానికి ప్రతీకగా చక్కని బొమ్మలతో సచిత్రముగా అలరారుచున్నది. కానీ పిల్లలకిచ్చే భాష చాల క్లిష్టముగా ఉన్నది. కొంత సరళంగా ప్రచురిస్తే పిల్లలకు ఆనందదాయకం.

– బి.జి. మోహనరావు, తిరునింద్రవూరు

చిన్నారుల పడవయాత్ర ముఖచిత్రంతో వెలిసిన నవంబర్ సంచిక హృద్యంగా ఉంది. ఆనాడు ఆరు భాషల్లో వస్తున్న చందమామ పత్రికకు జూన్ 9, 1960న నెహ్రూ గారు పంపిన అభినందన లేఖ బాగుంది. అనుమానాలను విద్యార్థులతో తీర్చిన 'అమూల్యం' కథ బాగుంది. సైకిల్ కొని ఇచ్చిన తండ్రికి బంటి కృతజ్ఞత తెల్పడం బాగుంది. సుల్తాన్, ఫకీర్ వాదనలో మానవ మృగాలైన సుల్తాన్ మానవమాంసమును తినకుండా పోవడం నచ్చింది. అత్తను అమ్మలో చూడమని చెప్పిన 'నమ్మకం' కథ బాగుంది. పిల్లలకే కాదు పెద్దలకు కూడా తెలియని 'కుకీల' కథ బాగుంది. – వాస్తు రామచంద్ర, రాంజీనగర్, నెల్లూరు-2

దీపావళి సంచిక మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంది. 'ఎవరికి తగినట్లు వారికి' చిన్న కథ నీతిదాయకంగా ఉంది. మిగతా ఆణిముత్యాల్లాంటి కథలన్నీ చాలా బాగున్నాయి. 'చంద మామతో నా జ్ఞాపకాలు' పాత మధురిమలను రుచిచూపిస్తున్నాయి. పంచతంత్ర కథలు, శిథిలాలయం కొత్త మలుపులతో కొనసాగుతున్నాయి. దయచేసి మా కోరిక మన్నించి కొత్త సంవత్సరం కానుకగా పై వాటిని కొనసాగించండి.

– బిక్కనూరు రాజేశ్వర, పొన్కల, ఆదిలాబాద్

ఆరునెలల క్రితం కాళహస్తిలో ఉండే మా తమ్ముళ్ళ పిల్లలకోసం చందమామ పత్రికకు చందా కట్టాము. పిల్లల గొడవ ఏ ఇంట్లో అయినా ఉండేదే. కాని, ఇప్పుడు మాకో కొత్త సమస్య వచ్చింది. మా అబ్బాయి జ్యోతిరాదిత్య పేరుతో చందమామ వస్తుంది. దానికోసం ఇంట్లో పిల్లల మధ్య ఎంత పోటీ అంటే ముందుగా చందమామ ఎవరు తీసుకోవాలి, చదవాలి అని ఒకటే గొడవ. ఎవరో ఒకరు తీసుకుని చదివి తర్వాత మరొకరికి ఇవ్వండిరా అంటే ఎవరూ వినరు. మా పాప గొడవ మరీ ఎక్కువైంది. 'చందమామ జ్యోతరాదిత్య పేరుతో కాదు జ్యోత్స్న పేరుతో రావాలి' అని యాగీ చేస్తుంటుంది. తన పేరుతో అయితే పోస్ట్ వస్తూనే రాణీలాగా దబాయించి మరీ తీసుకోవచ్చు కదా అని తన ఆలోచన. దీంతో పిల్లల బాధ పడలేక ఒకే ఇంటికి మరో చందమామ కూడా తెప్పించుకోవాలని అనుకుంటున్నాము. నావిషయానికి వస్తే "ఈ వయసులో కూడా చందమామ చదువుతున్నావా' అని ఎవరైనా అడిగితే కోపం తన్నుకొస్తుంది. నా చందమామ నేను చదువుకుంటే వీళ్లకెందుకో ఇంత ఉలుకు అనిపిస్తుంటుంది.

– జ్ఞానప్రసూన, టీచర్, రేణిగుంట

1968–69 నాటి బొమ్మలతో 'కృష్ణావతారం' సీరియల్ తిరిగి ప్రచురించగలరు. అలాగే చిత్రా, శంకర బొమ్మలతో ఉన్న 'అరేబియా కథలు' తిరిగి ప్రచురించగలరని ప్రార్థన. పత్రిక ధరను కాస్త పెంచి, చివర వేస్తున్న పేజీలు తగ్గించి సైజు అడ్డంగా కొంచెం పెంచగలరని మనవి.

– సునీత, ఆర్టిస్ట్, హైదరాబాద్

మేము ప్రతినెలా చందమామ మాసపత్రిక చదువుతున్నాము. కథలు, ఆ కథలకు వేస్తున్న బొమ్మలు చాలా బాగున్నాయి. పంచతంత్ర కథలు, బేతాళ కథలు మమ్మల్ని ఎంతో ఆసక్తిగా చదివిస్తున్నాయి. కథలు చదివేందుకు ప్రతినెలా చందమామ కోసం ఎదురు చూస్తున్నాము. చందమామ నవంబర్ సంచికలోని అన్ని కథలు చాలా ఆసక్తికరంగా ఉన్నాయి. మన దేశ భాషలు నేర్చుకుందాం, శీర్షిక ద్వారా దేశంలోని వివిధ భాషల గురించి కొద్దిగానైనా తెలుసుకు నేందుకు ఎంతగానో ఉపయోగపడుతోంది. చందమామ లోకజ్ఞానం క్విజ్ ఎన్నో తెలియని విషయాలు తెలుసుకునేందుకు ఉపయోగపడుతోంది. మంచి శీర్షికలు అందిస్తున్న చందమామ సంపాదకవర్గానికి కృతజ్ఞతలు.

– తాతా భవ్యశ్రీ/తాతా అనీష్ కుమార, బ్రాడీపేట, గుంటూరు

Avail the loyalty bonus!

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions - within India)**



**Chandamama!**

Because stories make the world go round...

**Choose** your Chandamama! Go to www.chandamamashop.com & subscribe Now!!



You can also subscribe online at: **www.chandamamashop.com**

**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ..........................................................................

Date of Birth: ............................ Sex :..................................

Address: .......................................................................

..................................................................................

..................................................................................

............................................... City: ..................................

State:..................................... Pin:.......................................

Telephone:.....................................................................

Mobile:..........................................................................

Email:...........................................................................

Subscription Number (for renewals):.........................................

Gift Subscription to the following address:

..................................................................................

..................................................................................

..................................................................................

..................................................................................

Enclosed Cheque/DD* for Rupees..............................................

Cheque/DD No ..............................................................

favouring Chandamama India Ltd on..........................................

..............................................................................bank.

* Your subscription will commence in 6 weeks.
Please mail the subscription form to:
**Chandamama India Limited,**
P.O.Box No:19407, Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at : www.chandamamashop.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# చందమామతో నా జ్ఞాపకాలు – కన్నడ

నాకు 12 ఏళ్ల వయస్సు ఉన్నప్పుడు అంటే 1979లో, మా మామయ్య 'చందమామ', 'బాలమిత్ర', 'బొమ్మరిల్లు' వంటి పత్రికలను కొని చదువుతుండేవారు. అప్పట్లో పిల్లల పత్రికలు చాలానే ఉంటున్నప్పటికీ, చందమామపట్ల ప్రత్యేక ఆకర్షణ ఉండేది. మా ఇంట్లో అన్ని చందమామ పత్రికలను మేం భద్రంగా దాచిపెట్టేవాళ్లం. అప్పుడు నేను 5వ తరగతి చదువుతూండేవాడిని. తొలిసారిగా నేను చందమామలో 'అత్తరు సాహేబు' కథను చదివినట్లు గుర్తు. ఈ రోజు వరకు నేను ఆ కథ పేరు గుర్తుపెట్టుకునే ఉన్నాను. అప్పటి నుంచి నేను చందమామను క్రమం తప్పకుండా చదువుతూ వస్తున్నాను. చందమామలో నాకు గుర్తున్న మరొక ఆసక్తికరమైన కథ 'పొరుగింటి సరసమ్మ.' ఈ కథలో ఒకామె కరివేపాకు కోసం ఇరుగుపొరుగులతో జగడమాడుతూ ఉంటుంది. ఇది చాలా మంచికథ.



Name: S.M. Loni
Occupation: Teacher
Bijapur, Karnataka.

నేను 1982లో బీజాపూర్‌కి మా అమ్మమ్మతో కలిసి వెళ్లినప్పుడు ఆమె నా ఖర్చులకోసం రెండు రూపాయలు చేతిలో పెట్టింది. అప్పటికే చందమామను ప్రతి నెలా చదవటం అలవాటయింది. అవ్వ ఇచ్చిన ఈ డబ్బుతో నేను చందమామ కొనుక్కున్నాను. రంగురంగులతో ఉన్న ఆ చందమామ కనువిందు చేసింది. ఆ సంచికలోని నీతి బోధక కథలు చాలా నచ్చాయి. 'ముగ్గురు మాంత్రికులు' సీరియల్ కూడా చాలా ఆసక్తికరంగా నడిచేది.

గత దశాబ్దంలో వచ్చిన అన్ని చందమామలను నేను భద్రపర్చాను. ఈ సందర్భంగా 'అత్తరు సాహేబు', 'పొరుగింటి సరసమ్మ' వంటి కథలు తిరిగి ప్రచురించమని మిమ్మల్ని కోరుతున్నాను. పిల్లలు, పెద్దలు తేడా లేకుండా ఆబాలగోపాలానికీ నిజాయితీ, సత్యం, న్యాయవర్తన, నీతి, ప్రేమ వంటి గుణాలను నేర్పే ఏకైక పత్రిక చందమామ.

పాత ఎప్పటికీ బంగారమే. చందమామలో మరికొన్ని పాత కథలను ప్రచురించండి. మా రోజుల్లో మాకు నీతిని, సత్ప్రవర్తనను బోధించిన విలువలు ఈ కాలంలో కూడా అందరికీ అవసరమే. పర్యావరణం, జంతువులు, పక్షులు వంటి కథలు ఒకటి రెండు చాలు. దయచేసి, నీతి, తర్కం, సత్యం వంటి గుణాలను నేర్పిన పాత కథలనే చందమామలో ఎక్కువగా ప్రచురించండి. మా ఇంట్లో పిల్లలు కూడా ఇప్పుడు చందమామ అంటే పడి చస్తున్నారు.

# చందమామతో నా జ్ఞాపకాలు - హిందీ

నా చిన్నప్పటినుంచి చందమామతో నాకు ప్రత్యేక అనుబంధం ఉండేది. నేను పుట్టినప్పుడు మా తల్లితండ్రులు సీతాపూర్‌లో ఉండేవారు. నేను పుట్టక ముందు కూడా మా కుటుంబం చందమామకు చందా కట్టేదట. విచిత్ర కవలలు, ముగ్గురు మాంత్రికులు, శిథిలాలయం, దుర్గేశ నందిని వంటి సీరియల్స్ ఇప్పటికీ నా జ్ఞాపకాలలో మిగిలే ఉన్నాయి. చందమామ పుస్తకాలను నాన్న నాకోసం బైండ్ చేసి ఉంచాడు. వీటిలో చాలావాటిని మా బంధువు ఒకరు పట్టుకెళ్లారు. కాని నావద్ద ఇంకా చాలా పుస్తకాలు ఉన్నాయి. ఈ రోజుకీ మా ఇళ్లలో కొత్త చందమామలను కూడా కొని భద్రపర్చుకోవడం అలాగే కొనసాగుతోంది.

నేను 1978 నుంచి 82 వరకు పంజాబ్‌లో ఉన్న కాలంలో నేను హిందీ, పంజాబీ భాషల చందమామలను కొనేవాడిని. దీనివల్ల నేను పంజాబీ నేర్చుకోగలిగాను. నా బాల్యంలో జరిగిన ఒక సంఘటన నాకు ఇప్పటికీ గుర్తు ఉండిపోయింది. అది 1965 డిసెంబర్‌లో అనుకుంటా... మా నాన్న అధికారిక పర్యటన కోసం వెళ్లారు. నాకోసం ఏం తీసుకురావాలని నాన్న నన్ను అడిగారు. చందమామ పత్రిక కావాలని చెప్పాను. కాని నాన్న తిరిగొచ్చినప్పుడు చందమామకు బదులుగా స్వీట్లు, ఇతర పత్రికలు పట్టుకొచ్చారు. వాటిలో వేటినీ నేను తీసుకోలేదు. కనీసం తినుబండారాలను కూడా తినలేదు. అప్పుడు మా నాన్న దుకాణాదారుకు ప్రతి నెలా చందమామ సంచికను తప్పకుండా పంపవలసిందిగా ఆదేశించారు.



Name: Krishna Gopal
Occ: Sr. Sub Editor, Aaj.
Gorakhpur (U.P.).

మాకు పిల్లలు కలిగేటప్పటికీ, మేము చందమామను కొంటూనే ఉన్నాము. మా అమ్మాయి సురభి శ్రీవాత్సవ చందమామ పబ్లికేషన్స్ నుంచి రెండు సార్లు కథారచయితగా బహుమతులు గెల్చుకుంది. ఆమె జీవశాస్త్రంలో ఎమ్ఎస్‌సి చేసింది. ఆమె సాధించిన విజయంలో చందమామకు కూడా కొంత పాత్ర ఉండటం చూసి నేను గర్వపడుతున్నాను.

Request to readers: Contributors of stories, memories are requested to send in their entries with their complete name, address, phone no and other contact details to enable us to get back to you.
Write to us:
**Chandamama India Ltd.,** No:2 Ground Floor,
Swathi Enclave, Amman koil street, Vadapalani, Chennai-600026.
• Phone: 044-43992828 • Email : online@chandamama.com

## బేతాళ కథలు

# నిబద్ధుడి ఎంపిక

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి ఎప్పట్లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు 'రాజా, నీ కోరికలు నెరవేర్చుకోవడానికి అద్భుత శక్తులను పొందాలని నీవింత శ్రమిస్తున్నావని నా అనుమానం. లేదా ఈ ప్రపంచంలో ప్రతి ఒక్కరూ స్వార్థపరులేనని, తమ బాగు తాము చూసుకునేవారేనని నీవు భావిస్తుండవచ్చు. దురాశాపరులనుంచి, తమ సమస్యలు తప్పితే ఇంకేవీ పట్టించుకోని అధిక సంఖ్యాక ప్రజలనుంచి నిజాయితీపరులను, విశ్వసనీయులను, వాస్తవమైన మనుషులను వేరు చేసి గుర్తించడం చాలా కష్టం. దురాశాపరులలో కూడా అటువంటి నిజాయితీపరులు ఉంటారని నీవు తెలుసుకోవడానికి నీకు ఒక కథ చెబుతాను విను' అంటూ ఇలా చెప్పసాగాడు.



పూర్వం, కాశీరాజుకు ప్రపంచమంతటి నుంచి గౌరవ ప్రపత్తులు లభించేవి. దేవేశ్వర ప్రతాపసింహుడు కాశీ పాలకుడిగా ఉండేవాడు.

ప్రతాప్ సింహుడు ధైర్యసాహసాలకి, నిజాయితీకి మారుపేరుగా ఉండేవాడు. ప్రజల శ్రేయస్సు, సంతోషంకోసం అతడు శతవిధాలా పాటుపడేవాడు. కాశీ ప్రజలు కూడా తమ రాజును ఎంతగానో గౌరవించేవారు. రాజ్యపరిపాలనలో సుదీర్ఘకాలం గడిపిన తర్వాత రాజు కూడా అలసిపోయాడు.

ఈ విషయాన్ని అతడు ప్రధానామాత్యుడు చంద్రశేఖరశాస్త్రితో చర్చించాడు.

'ప్రభూ! పాలనావ్యవహారాలతో మీరు విసిగిపోయారు. మీకు విశ్రాంతి కావాలి. రాజుగా మీరు ఈ రాజ్యానికి అత్యున్నత అధిపతిగా ఉన్నారు. కాని వీటితో పాటు రాజ కోశాధికారిగా కూడా మీకు కొన్ని విధులున్నాయి. రాజకోశాన్ని తగిన విధంగా నిర్వహించడానికి ప్రత్యేక కోశాధికారి అవసరం ఉన్నప్పటికీ, ఈ అదనపు బాధ్యతను మీకు మీరే చేపట్టవలసి ఉంటుంది. కానీ ఇతర బాధ్యతలను మోస్తూ ఈ పనిచేయడం చాలా కష్టం. అందుకే మీరు అలసిపోతున్నారు.' అన్నాడు మహామంత్రి.

'రాజనేవాడు తప్పకుండా రాజ్య పాలనా వ్యవహారాలలో పాలుపంచుకోవాలి, కాని కోశాగారాన్ని నిర్వహించిన బాధ్యతను అతడు ఎందుకు మోయాలి? కాని మీరు చెప్పింది మాత్రం నిజం. నేను అధికభారంతో కుంగిపోయాను. నాపై ఈ ప్రత్యేక బాధ్యతకు ఏది మూలకారణం?' అని ప్రశ్నించాడు రాజు.

దానికి మంత్రి సమాధానమిస్తూ, వాస్తవానికి కాశీరాజు రాజ్య కోశాధికారి పదవిని సాంప్రదాయికంగానే నిర్వహిస్తూ వచ్చారు. మీ తండ్రి రాజా యుద్ధవీరసింహుడు ఈ సంప్రదాయాన్ని అమలులోకి తెచ్చాడు.'

'మంత్రివర్యా, మీరు నాకంటే అనుభవశాలురు, పెద్దవారు కూడా. మీరు మా తండ్రిగారిని కూడా సేవించారు. మీతో ఆయన చాలా విషయాలలే చర్చించుంటారు. కాశీలో ఇలాంటి వ్యవస్థను సృష్టించడానికి తగిన కారణం ఏమిటో దయచేసి నాకు బోధపర్చండి.'

మహామంత్రి మందహాసం చేస్తూ... 'రాజా, ఈ తప్పనిసరి సంప్రదాయం వెనుక ఒక అవమానకరమైన ఘటన దాగి ఉంది.

మీ తండ్రి తన రాజ్యంలో ప్రజలు ఎలా ఉంటున్నారో చూడటానికని తరచుగా మారువేషంలో పట్టణం దాటి వెళ్లేవారు. అదేసమయంలో రాజ సేవకులు ఎలా పని చేస్తున్నారో కూడా పరిశీలించేవారు. రాజు మారువేషంలో ఉండగా అతడిని ఏ ఒక్కరు కూడా గుర్తించగలిగేవారు కాదు. ఆవిధంగా మీ తండ్రి తన రాజ్యంలో జరుగుతున్న ఘటనలన్నింటి పట్లా అప్రమత్తంగా మెలిగేవాడు.'

'రాజు మారువేషంలో వెళ్లేటప్పుడు నేను కూడా ఆయనను అనుసరించేవాడిని. ఒక రాత్రివేళ రాజు నగరాన్ని దాటి వెళ్లారు. మేం ఆ సమయంలో రాచ గిడ్డంగిలోకి ప్రవేశించాము. ఆ సమయంలో కోశాగారం లోపల వెలుతురు ఉండటం చూసి ఆశ్చర్యపోయాము. అక్కడ ఎవరో మాటలాడటం కూడా విన్నాము. మేం నిశ్శబ్దంగా అక్కడికి వెళ్ళి జరుగుతున్నది చూసి నిర్ఘాంతకు గురైనాము. రాజ కోశాధికారి తన సహాయకుడి తోడ్పాటుతో కోశాగారాన్ని కొల్లగొట్టాలని చూస్తున్నాడు. అతడు సాక్ష్యాధారాలతో సహా దొరికిపోయాడు. ఈ ఘటనలో కోశాధికారి తప్పించుకుని పారిపోయాడు. కాని అతడి సహాయకుడు మాత్రం పట్టుబడ్డాడు.

రాజు వెనువెంటనే కోశాధికారిని పట్టుకుని రేపటి దినం తన ఆస్థానానికి తీసుకు రావలసిందని ఆదేశించాడు.'

'ఆ మరుసటి దినం, మీ తండ్రి యుద్ధ వీర సింహుడు తన ఆస్థానంలోని సహాయకులందరినీ పిలిపించాడు. జరిగిన నేరం చర్చించారు. కోశాధికారి తీవ్రతప్పిదం చేశాడని అందరూ అంగీకరించారు. కోశాధికారికి రాజు మరణశిక్ష విధించాడు. అయితే,





రాజు దయార్ద్ర హృదయుడు. నన్ను కూడా సలహా అడిగాడు. దాంతో తప్పు చేసిన కోశాధికారిని నగర ప్రజలందరి ముందు అవమానించి, యావజ్జీవ కారాగార శిక్ష వేయాలని నిర్ణయించాము. అయితే కోశాధికారి తన శిక్షను అనుభవిస్తుండగా జబ్బుపడ్డాడు. దాంతో అతడి కథ ముగిసింది.'

'రాజు మాత్రం అప్పటినుంచి చాలా జాగ్రత్తగా ఉండేవాడు. ఆనాటినుంచి కాశీ రాజే స్వయంగా కోశాధికారిగా ఉండాలని నిర్ణయించాడు. అలా ఈ సంప్రదాయం కొనసాగుతూ వచ్చింది.'

గత చరిత్ర విన్న ప్రతాపసింహుడు 'నేను కూడా ఆ నిర్ణయాన్ని ఆమోదిస్తాను. కాని ఈ అదనపు పని భారం రాజ్యపాలనపై ప్రభావం చూపుతుంది, ఈ సమస్యకు శాశ్వతమైన పరిష్కారం కావాలి. రాజు ఆదేశానికి విధేయత చూపగల పరిష్కారం. ఇది రాజ్యపాలనను సులభతరం చేయడమే కాకుండా, కోశాగారాన్ని సురక్షితంగా ఉంచగలదు కూడా' అన్నాడు.

'శాశ్వత పరిష్కారమా? అయితే, అత్యంత నిజాయితీ కలిగిన వ్యక్తికి కోశాగార బాధ్యతను అప్పగించండి. బయటి వ్యక్తికి బాధ్యతను అప్పగించడం కంటే మన ఆస్థానంలోని వారినుంచే ఎవరో ఒకరిని ఈ పనికి మనం ఎంచుకుంటే బాగుంటుందని తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు మహామంత్రి.'

'మనం రేపు ఉదయాన్నే ఆస్థానంలో ఈ కొలువుకు తమ పేరు నమోదు చేసుకోమంటూ పిలుపిద్దాము. వచ్చిన పత్రాలను అన్నింటినీ పరిశీలించి ముఖాముఖీ మాట్లాడిన తర్వాతే అర్హుడైన వ్యక్తిని ఎన్నుకుందాము. దీనికోసం ఒక ఎంపిక మండలిని ఏర్పరుద్దాము. రాజుగా మీరు ఆ మండలికి నేతృత్వం వహించండి. నేనూ, సేనాధిపతి, రాజవైద్యుడు, రాజగురువు ఈ మండలిలో ఉంటాము' అన్నాడు మంత్రి.

రాజు దీనికి అంగీకరించాడు. కోశాధికారి పదవికోసం నమోదు చేసుకోవలసిందని రాజప్రకటన వెలువడింది. ఆస్థానంలో ఉన్న నూటొక్కమందిలో వందమంది తమ పేరు నమోదు చేసుకున్నారు.

రాజు తీవ్రంగా ఆలోచించాడు. ఈ పదవి అంత ముఖ్యమైంది కాబట్టే దాదాపు అందరూ నమోదు చేసుకున్నారా? తర్వాత అతడు ఎంపిక మండలిని సమావేశపర్చాడు. ఈ



పదవికి పేరు నమోదు చేసుకోని ఏకైక అభ్యర్థి పేరు విశాలగుప్తుడు. ఇతడు ఆర్థిక వ్యవహారాల్లో నిపుణుడు. రాజ్య ఆర్థిక విధానాలపై సలహా ఇస్తుంటాడు. అలాగే రాజ్యానికి సంబంధించిన ద్రవ్య వ్యవహారాలకు కూడా బాధ్యత వహిస్తుంటాడు.

సరైన అర్హత, అనుభవం ఉన్న వ్యక్తి ఈ పదవికి ఎందుకు పేరు నమోదు చేసుకోలేదని ఎంపిక మండలి సభ్యులు ఆశ్చర్యపడ్డారు. ఆస్థానంలో బహిరంగ సభలో మరుసటిదినం అభ్యర్థులను పిలిపించి పరిశీలించాలని నిర్ణయించుకున్నారు.

ఆ మరుసటి దినం, అభ్యర్థుల గుణగుణాల పరిశీలన ప్రారంభమైంది. రాజాస్థానంలో రాజ సభికులు, సామాన్య ప్రజలు కూడా ఉన్నారు. రాజు తరుపున ప్రధానమంత్రి అభ్యర్థులను ప్రశ్నించసాగాడు. 'కోశాధికారి పదవికి పేరునమోదు చేసుకున్న అందరికీ ఒక ప్రశ్న. ఈ పదవికి మీరే తగిన అభ్యర్థి అని ఎందుకు భావిస్తున్నారు? ఈ పదవికి మీరు ఎందుకు నమోదు చేసుకున్నారు?'

రాజు అడిగిన ప్రశ్నకు ఆ వందమంది అభ్యర్థులలో ఏ ఒక్కరూ సరైన సమాధానం ఇవ్వలేకపోగా, తానే తగిన అభ్యర్థినని రుజువు చేసుకోలేకపోయారు. దాంతో ప్రధాన మంత్రి రాజు అనుమతితో, ఆ పదవికి పేరు నమోదు చేయని వ్యక్తిని సంబోధిస్తూ నీవు ఈ పదవికి పేరు ఎందుకు నమోదు చేసుకోలేదని ప్రశ్నించాడు.

విశాలగుప్తుడు తన ఆసనం నుంచి లేచి వినయంగా ఇలా సమాధానమిచ్చాడు. 'అయ్యా! నేను ఇప్పుడు చేస్తున్న పనులు బాధ్యతలతో పూర్తిగా సంతృప్తితో ఉన్నాను. ఆస్థాన ఉద్యోగిగా నేను రాజ్య శ్రేయస్సు కోరి ఆర్థిక వ్యవహారాలపై నా అభిప్రాయాన్ని తరచుగా వ్యక్తపరుస్తూ ఉన్నాను. అందుకే రాజ కోశాధికారి పదవికి నేను పేరు నమోదు చేయలేదు. ఈ పదవికి నేను తగిన వాడిని కానని నాకు నేనుగా భావించడంతో నా అభ్యర్థిత్వం అంతటితోనే ముగిసిపోయిందని నేను భావించాను.'

తర్వాత దేవేశ్వర ప్రతాప మహారాజు ఇలా ప్రకటించాడు. 'గౌరవనీయులైన కాశీ పురవాసులారా! కాశీ నగర రాజునైన నేను రాజుగా నా విచక్షణాధికారాన్ని ఉపయోగించి, విశాలగుప్తుడిని కాశీ రాజ్య కోశాధికారిగా నియమిస్తున్నాను. ఈ కొత్త పదవికి

అనుగుణంగా అతడి జీతభత్యాలు నిర్ణయించాలని ఆదేశిస్తున్నాను.'

ఆస్థానంలో ఒక్క క్షణం చీమ కుడితే చిటుక్కుమనేంత నిశ్శబ్దం ఆవరించింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, విక్రమార్కుడితో, 'ఓ రాజా, విశాలగుప్తుడిని రాజ్య కోశాధికారి పదవికి ఎందుకు ఎన్నుకున్నట్లు? అతడు వాస్తవానికి ఆ పదవికి పేరునమోదు చేసుకోలేదు. పైగా రాజాస్థానంలో యావన్మంది ముందూ తన ప్రస్తుత బాధ్యతల పట్ల తాను సంతోషంగా ఉంటున్నానని ప్రకటించాడు కూడా. ఇప్పుడు ప్రశ్న ఏదంటే ఆ పదవికి అర్హుడిని కానని తనకు తానుగా ప్రకటించుకున్న విశాలగుప్తుడినే ఆ పదవికి ఎందుకు ఎంపిక చేశారు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసీ చెప్పకపోయావో నీతల వేయి ముక్కలవుతుంది,' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, 'అభ్యర్థులందరూ కోశాగారంలోని ధనాన్ని దుర్వినియోగపర్చాలనే పథకాన్ని తమ మనస్సులలో ఉంచుకునే వచ్చారని రాజు అర్థం చేసుకున్నాడు. అలాంటి వ్యక్తులు ఆ పదవికి ఎంపికయ్యే అవకాశాన్ని ఏమాత్రం కల్పించకూడదని రాజు భావించాడు.'

'అందుకనే, ఈ పదవికి పేరునమోదు చేసుకోని వారి పైనే రాజు దృష్టి పెట్టాడు. ఆ తర్వాతే అతడు తక్కువ వేతనం లభిస్తున్న ఆ పదవిని ఎందుకు ఆశిస్తున్నారంటూ అభ్యర్థులందరినీ ప్రశ్నించాడు. వారినుంచి సరైన సమాధానం రాకపోవడంతో తాను ఊహించినదే సరైనదని రాజు అభిప్రాయానికొచ్చాడు. ఆ తర్వాత సభలో విశాలగుప్తుడి సమాధానం విన్న రాజు, అతడు తన బాధ్యతలతో సంతుష్టి చెందాడని, నిజాయితీపరుడని, దురాశ లేనివాడని గ్రహించాడు. ఆ పదవికి అతడే ఉత్తమమైన అభ్యర్థి అని అప్పటికే తేలిపోయింది. ఈ పరిస్థితిలోనే రాజు సరైన నిర్ణయం తీసుకోగలిగాడు.'

రాజుకీవిధంగా మౌనభంగం కలుగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగీ చెట్టెక్కాడు. – కల్పితం

(ఆధారం: డా. శుభాంకర్ బెనర్జీ)





# సజీవ దేవుడు

భర్త రాము పనీపాటా లేకుండా తోటలో కూర్చుని ఉండటం చూసిన అంజలికి చిర్రెత్తుకొచ్చింది. చిరాకుపడుతూ భర్తను పిలిచి, 'ఏమయ్యా! పగటి కలలు కనడం కట్టిపెట్టి, పట్టణానికి వెళ్లి ఈ వారానికి సరిపడే సరుకులు తీసుకుని రా' అని చెప్పింది.

రాము పళ్లు కొరుక్కుంటూ, చేసేదేమీ లేక పట్టణానికి బయలుదేరాడు. తోటి గ్రామీణులకు మల్లే అతడు కష్టజీవి కాదు. అడ్డదారుల్లో డబ్బు సాధించడం ఎలా అంటూ రోజంతా మల్లగుల్లాలు పడుతూ ఉండేవాడు.

పట్టణానికి వెళ్లేటప్పుడు రాము ఊరి బయట నది దాటవలసి వచ్చింది. ఏటికి అవతల ఒడ్డున గట్టు పొడవునా దట్టంగా చెట్లు పెరిగాయి. చెట్లవరుసలో నడుస్తుండగా రాము పెద్ద చింతచెట్టు చూశాడు. అతడి మనస్సులో పలు ఆలోచనలు రేగాయి. కొద్ది రోజుల క్రితం పట్టణంలో ఒక కలప వ్యాపారి రాముతో మాట్లాడుతూ తనకు అత్యవసరంగా చింతకలప కావాలని, మంచి ధర చెల్లిస్తానని చెప్పాడు. ఆ మాటలు గుర్తుకు రాగానే రాముకు మెరుపులా ఒక ఆలోచన తట్టింది. ఈ చింతచెట్టు ఏటికి సమీపంలో గట్టుపై ఉంది. అక్కడ దాన్ని నరికి ముక్కలు చేసినట్లయితే, కలప గిడ్డంగికి తీసుకుని పోతే భారీగానే డబ్బు ముట్టవచ్చు. తాను పట్టణం వెళ్లాలనే విషయం మర్చిపోయి, అతడు అక్కడే నిలబడి పథకం పన్నాడు.

ఈ పనికోసం తన స్నేహితుడు గోపీ సహాయం తీసుకోవాలని అనుకున్నాడు. రాము చేసే తప్పు పనులన్నింటిలో అతడూ భాగం పంచుకునేవాడు. చెట్లు కొట్టడంలో

డి. జానకి



అనుభవం ఉన్న కాలయ్య సహాయం తీసుకోవాలని అతడు భావించాడు. రాబోయే పున్నమి రాత్రి కాలయ్య చెట్టును కొడతాడు. గోపీ ఎద్దుల బండిని, కూలీని పిలుచుకు వస్తాడు. చెట్టును కోసి ముక్కలు చేసిన తర్వాత తెల్లారకముందే వాటిని బండిలో వేసుకుని కలప గిడ్డంగికి తీసుకుపోతారు. కలపవ్యాపారి నుంచి డబ్బు తీసుకుంటాడు. ఈ పనిలో సాయపడినవారికి తలా కొంత పంచి మిగిలిన సొమ్ముతో ఇంటికి వస్తాడు.. అలా ఆలోచిస్తూ భుజాలు ఎగరేశాడు రాము. అనంతరం పట్టణం వెళ్లి కలప వ్యాపారిని కలిశాడు. తాను తెచ్చి ఇచ్చే కలపకోసం మంచి బేరం మాట్లాడుకున్నాడు. ఆ తర్వాత గోపీని, ఇతరులను సంప్రదించాడు. తను వేసిన పథకాన్ని వారికి చెప్పాడు. వారందరూ చేరి మాట్లాడుకుని చేయవలసిన పనిని ఖరారు చేసుకున్నారు.

సమయం రానే వచ్చింది. రాముకు మనసులో ఉత్సాహం పొంగి పొరలుతోంది. చింతచెట్టు పడగొట్టే శుభదినం ఈరోజే మరి. వాతావరణం కూడా అనుకూలంగా ఉండటంతో వారంతా ఉత్సాహంగా ఉన్నారు. సాయంత్రానికి కారుమేఘాలు కమ్ముకున్నాయి. చీకటిపడేవేళకు మెరుపులు మెరిసాయి. త్వరలోనే వర్షం ధారగా కురవసాగింది. రాత్రి భోజనం ముగించుకున్న రాము పథకం ప్రకారం చింతచెట్టు వద్దకు ప్రయాణమయ్యాడు. చెట్టు కొట్టే కాలయ్య చెట్టువద్దే అతడిని కలుసుకుంటాడు. ఇతరులు కూడా అర్ధరాత్రి నేరుగా అక్కడికే వచ్చి కలుస్తారు. అలా ఆలోచించుకుంటూ, వర్షాన్ని లెక్కచేయకుండా రాము నదికేసి బయలుదేరాడు. నది సమీపంలో కనుచూపు మేరలో ఎవరూ కనపడలేదు. రాము పెద్దగా నిట్టూర్చాడు. ఎవరయినా తను చేస్తున్న పని చూసి గ్రామపెద్దకు చెపితే తను పెద్ద చిక్కులో పడతాడు మరి.

వర్షం రాము ముఖాన్ని ఈడ్చి కొడుతోంది. మెల్లగా అతడు నదిని దాటసాగాడు. నదిలో మోకాటిలోతు నీళ్లు పారుతున్నాయి. సరిగ్గా నది మధ్యలో నడుస్తుండగా కాస్త దూరంలో అతడికి పెద్దగా శబ్దం వినిపించింది. రాము ఎడమవైపు తిరిగి చూశాడు. నది ఎగువ నుంచి నీళ్లు తన్నుకొస్తున్నాయి.

'దేవుడా, అది అటవీ ప్రాంత నది. ఎగువన వర్షం పడిందంటే వెంటనే నదికి వరద

ముంచుకొస్తుంది' ఈ విషయం తల్చుకో గానే రాము వణికిపోయాడు. ప్రాణం కాపాడుకోవడానికి పరుగు పెట్టాడు. నది గట్టుకు అడుగు దూరంలో ఉండగానే రాము వరదలో చిక్కుకున్నాడు. నీళ్ళు ఒక్క సారిగా ఎత్తి కుదేశాయి. రాము పెనుకేక పెట్టాడు. 'దేవుడా! నన్ను కాపాడు.'

ఉన్నట్లుండి దూలంవంటి వస్తువుపై పోయిపడ్డాడు. దాన్ని రెండు చేతులతోనూ పట్టుకున్నాడు. అమ్మయ్య. వరద ప్రమా దంనుంచి గట్టెక్కినట్లే... కాస్సేపయ్యాక తను ఒక చెట్టును పట్టుకుని ఉన్నట్లు అర్థ మయింది. వరదనీటిలో కొట్టుకుపోకుండా తనను కాపాడింది ఈ చెట్టే మరి. నెమ్మదిగా అతడు చెట్టుపైకి ఎక్కి కూర్చుండిపో యాడు.

కనుచూపుమేరా ఎవరూ కనపడలేదు. తన మిత్రుడు గోపీ, చెట్లు కొట్టే కాలయ్య, పనివాడు ఎక్కడా కనపడలేదు. వాళ్లు తెలి విగా ఉండి నది దాటి రాకుండా ఉండిపో యారేమో! ఆ రాత్రంతా తను చెట్టుమీదే ఉండాలని రాము గుర్తించాడు. వేరే మార్గం లేదు. కాస్సేపయ్యాక వరదనీటిలో ఒక శరీరం కొట్టుకు వస్తున్నట్లు చూశాడు. అత డొక అబ్బాయి. ఒక్కసారిగా రాము అతడిని చెట్టుపైకి లాక్కున్నాడు. త్వరలోనే ప్రాణంతో నిలిచిన కొన్ని మేకలు నీటిపై తేలియాడుతూ కనిపించాయి. రాము వాటిని కూడా కాపా డాడు. ఆ అబ్బాయి గొర్రెల కాపరి. నదికి సమీపంలో ఉండే అతడి గుడిసె వరదనీ టిలో కొట్టుకుపోయింది.



రాము, గొర్రెల కాపరి, మేకలు రాత్రంతా ఆ చెట్టు మీదే ఉండిపోయార్ఱు. వరద నీరు మరికాస్త ఎత్తులో వచ్చి ఉంటే చెట్టు సైతం కొట్టుకుపోయేది. కాస్సేపయ్యాక, వర్షం ఆగిపోయింది. వరద కూడా తగ్గుముఖం పట్టింది. తర్వాత తెల్లారిపోయింది. రాము తానెక్కడ ఉన్నాడో గమనించాడు. ఆశ్చర్యం. తాను నరికివేయాలనుకున్న చింతచెట్టు మీదే ఉన్నాడతను. ఆ చెట్టుకొమ్మల్నే తెగ నరికి డబ్బు కోసం దాన్ని తెగనమ్ముకోవాలని పథకమేశాడు తను. మరి ప్రతిగా ఆ చెట్టు తనకేమిచ్చింది? భయంకరమైన ప్రమాద పరిస్థితిలో అది తనకు నీడనిచ్చింది, ప్రాణం కాపాడింది. అతడి కను కొనుకుల నుంచి కన్నీళ్లు కారాయి. అతడు మెల్లగా గొణుక్కొన్నాడు.

'వృక్షరాజమా! నేను నీపట్ల క్రూరంగా, నిర్దయగా ప్రవర్తించాను. నన్ను క్షమించు!' సహజసిద్ధంగానే తను సోమరీ, స్వార్థపరుడూనూ. కాని ఆ కాళరాత్రి తను ఒక అబ్బాయిని, మేకలను కాపాడాడు. నిజంగా అది తన జీవితంలో ఎన్నడూ చేయని మంచి పని. తనవంటి క్రూరుడికి ఆశ్రయమిచ్చిన చింతచెట్టు ప్రభావంతో తను కూడా మంచి పని చేసి మనిషిగా మారాడు. ఈ ఆలోచన రాగానే రాము మనసు తేలికైంది. చింత చెట్టును కావిలించుకుని గొణిగాడు. 'కృతజ్ఞతలు. ఇన్నాళ్ళూ పశువులా వ్యవహరించాను. నన్ను మనిషిగా మార్చావు!'

ఉన్నట్లుండి అతడికి మనుషుల స్వరాలు వినిపించాయి. తన భార్య అంజలి, మరి కొందరు గ్రామస్తులు చెట్టువద్దకు పరుగెత్తి వస్తుండటం చూశాడు. రాము రాత్రంతా ఇంటికి రాకపోవడంతో అంజలి కలవరపడిపోయింది. కొంతమంది గ్రామస్తులను తీసుకుని అతడిని వెతుకుతూ వచ్చింది. అతడు క్షేమంగా ఉన్నాడని తెలియగానే ఆమెకు సంతోషం పట్టలేకుండా పోయింది. గత రాత్రి తాను చావుబతుకుల మధ్య ఎలా కొట్టుకులాడిందీ రాము వివరించి చెప్పాడు. వరద ముంపునుంచి బయటపడ్డమే గొప్ప అదృష్టమని అన్నాడు. అంజలి చెప్పింది.

'అవును భవానీ మాత దయవల్లే నీవు బతికి బయట పడ్డావు. మనం ఆ తల్లికి మొక్కుకుందాము.'

'వద్దు అంజలీ, ఈ దేవతే నన్ను కాపాడింది,' అంటూ రాము చింతచెట్టు కేసి చూపించాడు. 'ఇది సజీవరూపంలోని దేవుడు. నేను బతికి బట్టకట్టడానికి ఎవరికయినా కృతజ్ఞత చెప్పుకోవలసి వస్తే ఈ హరిత దేవుడికే చెప్పుకోవాలి. ఇకపై నేను పచ్చనాకు చెట్లను ఎన్నటికీ పడగొట్టనని ప్రమాణం చేస్తున్నాను. అలాగే ఇతరులు ఎవరయినా చెట్లు నరకడాన్ని కూడా నేను అడ్డుకుంటాను.'

తర్వాత అతడు చింతచెట్టు ముందు మోకరిల్లి ప్రార్థించాడు.





# సంతృప్తి

ఆత్మకూరు గ్రామంలో రామకృష్ణయ్య తన కుమార్తె శాంతలాదేవిని అదే వూళ్ళో ఉన్న బంధువుల యువకుడు కోటిరత్నానికిచ్చి పెళ్లి చేశాడు. కోటిరత్నం వ్యసనపరుడు కాడు, కష్టజీవి. ఉన్నంతలో ఏ లోటూ లేకుండా సంసారం నడిపేవాడు.

కొన్నాళ్ల తర్వాత కోటిరత్నం భార్యాసమేతంగా మామగారింటికి వచ్చాడు.

'మామయ్యా! నేను ఊరు విడిచి మన రాజధాని విజయనగరం వెళ్లి ఏద్దైనా వ్యాపారం చెద్దామని అనుకుంటున్నాను.' అన్నాడు.

రామకృష్ణయ్య ఆశ్చర్యపోయి 'నీకు మన ఊళ్లో ఏం లోటు ఉన్నది? పొలం సాగు చేసుకుంటూ హాయిగానే ఉన్నావు గదా?' అని అడిగాడు.

'ఆ మాట నిజమే. కాని నాకు ఇక్కడ జీవితం యాంత్రికంగా ఉండి చాలా విసుగు పుడుతోంది. ఎన్నాళ్లున్నా గొర్రె తోక బెత్తెడే అన్నట్లు పండే పంట భుక్తికి జరిగి పోతున్నది. చేతిలో డబ్బు ఏమీ మిగలడం లేదు. అందుకే పట్నం వెళ్ళి ఏదైనా చిన్న వ్యాపారం చేసి డబ్బు సంపాదించాలనుకుంటున్నాను,' అన్నాడు కోటిరత్నం.

'నీకు ఇదివరకు వ్యాపారంలో ఏం అనుభవం ఉన్నది? ఎవరి ఆపూ లేకుండా నగరంలో ఏం వ్యాపారం చేస్తావు?' అని అల్లుడిని ప్రశ్నించాడు రామకృష్ణయ్య.

'నగరంలో అందరికీ బియ్యం, అపరాలు అవసరం. పల్లెల్లో ఉండే పంట కొని నగరంలో దుకాణం తెరిచి అమ్ముతాను. మంచి లాభాలు ఉంటాయి. విజయన

వాణిశ్రీ



గరంలో నా స్నేహితుడు గోవిందు అన్ని విధాలా సహాయం చేస్తానని మాటిచ్చాడు,’ అన్నాడు కోటిరత్నం.

అల్లుడి ఉత్సాహం చూసి సంతోషించిన రామకష్ణయ్య పెట్టుబడిగా కొంత ధనం ఇచ్చాడు. కోటిరత్నం సంతోషించాడు. తండ్రి నిరుత్సాహపరచకుండా భర్తని ప్రోత్సహించినందుకు శాంతలాదేవి కూడా ఆనందపడింది.

సంవత్సరం గడిచింది. అల్లుడిని సంక్రాంతి పండుగకు ఆత్మకూరు రమ్మని రామకృష్ణయ్య కబురు చేశాడు. ఐతే తను వ్యాపారంలో తీరిక లేకుండా ఉన్నాననీ, మామగారినే విజయనగరం రమ్మనీ ఆహ్వానించాడు కోటిరత్నం.

రామకృష్ణయ్య సంక్రాంతి పండుగకు కూతురింటికి విజయనగరం వెళ్లాడు. కోటిరత్నం పంచభక్ష్య పరమాన్నాలతో మామగారికి విందు భోజనం పెట్టి ఖరీదైన దుస్తులు బహూకరించాడు. తనకు పెట్టుబడిగా యిచ్చిన డబ్బు కూడా తిరిగి ఇచ్చేశాడు. రామకృష్ణయ్య సంతోషించాడు.

‘మామగారూ, నేను వ్యాపార లావాదేవీలలో తీరిక లేకుండా ఉంటాను. ముందు ముందు ఊపిరి సలపనంతగా పని ఉంటుంది. పండుగలకు మేము రాలేము. మీరే ఇక్కడకు వస్తూ ఉండండి.’ అన్నాడు కోటిరత్నం.

రామకృష్ణయ్య సరేనని తలాడించి ఊరెళ్లిపోయాడు. ఆ మరుసటి సంవత్సరం సంక్రాంతి పండుగకు విజయనగరం వచ్చాడు. శాంతలాదేవి తండ్రిని పలకరించి కంచు పళ్లెంలో భోజనం వడ్డించింది. రామకృష్ణయ్య అసంతృప్తి చెందాడు.

‘అమ్మాయీ! మీ ఇంట్లో ఇంతకంటే మంచి పళ్లెం లేదా?’ అని కూతుర్ని ప్రశ్నించాడు. ఈ పర్యాయం కూడా శాంతలాదేవి అడ్డంగా తల ఊపింది. మరుసటి సంవత్సరం తండ్రి వచ్చినప్పుడు వెండి పళ్లెంలో భోజనం వడ్డించింది.

మామగారు ఇప్పుడు ఏమంటాడో చూద్దామని దూరంగా నిలబడి కుతూహలంతో గమనించసాగాడు కోటిరత్నం. కాని

రామకృష్ణయ్య ముఖంలో ఏమాత్రం తృప్తి కనిపించలేదు.

'అమ్మాయీ! మీ ఇంట్లో ఇంతకంటే మంచి పళ్లెం లేదా?' అని ప్రశ్నించడంతో శాంతలాదేవి బిత్తరపోయింది.

కోటిరత్నం తలపట్టుకున్నాడు. మామ గారు వెండి పళ్లెంతో వడ్డించినా ఎందుకు తృప్తిపడటం లేదో అతనికి అర్థం కాలేదు.

మళ్లీ సంక్రాంతి పండుగ వచ్చింది. రామకృష్ణయ్య విజయనగరం వచ్చాడు అల్లుడి పిలుపు అందుకుని. శాంతలా దేవి తళ తళ మెరిసిపోతున్న బంగారు పళ్లెంలో భోజనం వడ్డించి తండ్రి ప్రక్కనే కూర్చుని విసురుతూ ఉంది.

కోటిరత్నం మళ్లీ దూరంగా నిలబడి ఈసారైనా మామగారు తృప్తి పడతారా లేదా అని గమనిస్తున్నాడు.

'అమ్మాయీ! మీ ఇంట్లో ఇంతకంటే మంచి పళ్లెం లేదా?' అని కూతుర్ని యధా విధిగా ప్రశ్నించాడు.

శాంతలాదేవికి మతిపోయింది.

'అదేంటి నాన్నా! బంగారు పళ్లెం కంటే మంచిది ఎక్కడుంటుంది?' అని ప్రశ్నించింది.

'ఎందుకు ఉండదమ్మా? ఉంటుంది.' అన్నాడు రామకృష్ణయ్య నవ్వుతూ.

మామగారి ఉద్దేశం ఏమిటో అర్థం కాక కోటిరత్నం జుట్టు పీక్కున్నాడు. బంగారు



పళ్లెంలో భోజనం పెట్టినా మామగారు ఎందుకు తృప్తి పడలేదు? అంతకంటే మంచి పళ్లెం ఎటువంటి లోహంతో చేస్తారు? బంగారం కంటే ఖరీదైన లోహం ఎక్కడైనా ఉంటుందా? కోటి రత్నానికి ఎన్నో సందే హాలు కలిగాయి.

తమకు బంగారు పనులు చేసే బ్రహ్మా చారిని కలుసుకుని జరిగింది చెప్పాడు కోటిరత్నం.

'లోకంలో బంగారం కంటే మంచి పళ్లెం ఉంటుందా?' అని అడిగాడు.

బ్రహ్మాచారి నవ్వి, 'ఎందుకు ఉండదు? మహారాజులు, రాణీలు తినే పళ్లాలు నవ రత్నాలతో పొదిగిస్తారు. నవరత్న ఖచితమైన పళ్ళాలలో వాళ్ళు భోంచేస్తారు. బంగారు

పళ్లెం కంటే అవి మంచివే కదా,' అన్నాడు.

తర్వాత సంవత్సరం సంక్రాంతి పండుగ రోజుకి నవరత్నాలతో పొదిగిన బంగారు పళ్లాన్ని సిద్ధం చేయించాడు కోటిరత్నం.

శాంతలాదేవి తండ్రికి నవరత్నఖచిత మైన బంగారు పళ్లెంలో భోజనం వడ్డిం చింది. రామకృష్ణయ్య భోజనం చేస్తూం డగానే కోటిరత్నం అక్కడకు వచ్చాడు.

'మామగారూ! ఇంతకంటే మంచి పళ్లెం చేయించడం నా వల్లకాదు. మహారాజులు కూడా ఇటువంటి నవరత్న ఖచితమైన పళ్లెంలోనే భోజనం చేస్తారు,' అని ముందు గానే అన్నాడు కోటిరత్నం.

రామకృష్ణయ్య అందుకు పెద్దగా నవ్వి, 'నా ఉద్దేశం మీకు అర్థం కాలేదు. సంపాద నను బట్టే ఇంట్లో సౌకర్యాలు మెరుగుప డుతూ ఉంటాయి.

మీరు తినే కంచం విలువ పెరుగుతూ ఉందంటే మీ వ్యాపారం బాగా సాగుతూ ఉందనే కదా అర్థం. బాగా సంపాదించి వ్యాపారం వృద్ధి చేసుకోవాలనేది నా కోరిక. అది నర్మగర్భంగా సూచించాను.

వ్యాపారి ఎప్పుడూ తాను సంపాదించిన దానితో తృప్తిపడకూడదు. ఇతర వ్యాపా రులతో పోటీ పడుతూ వ్యాపారం వృద్ధి చేసుకోవాలి. అందువల్ల ఎక్కువమందికి ఉపాధి చూపించిన వారవుతారు.

రైతులు పల్లెలలో ధాన్యం పండిస్తే గదా బళ్లున్న వాళ్లు రవాణా చేసేది. ధాన్యాన్ని బియ్యంగా దంచే కూలీలు, పెద్ద వ్యాపా రులు, చిన్నవ్యాపారులు అందరూ జీవి స్తారు గదా! ఎవరికి వారు తృప్తిపడి ఊరు కుంటే ప్రపంచం నడవదు,' అన్నాడు.

కోటిరత్నానికి అంతా అర్థమైంది. తను పల్లెటూరు నుంచి నగరానికి వచ్చింది భుక్తికోసమే కాదు. బాగా సంపాదించ డానికి, అలాగే కొందరికి ఉపాధి కల్పించ డానికి కదా! అనుకుని తృప్తి పడ్డాడు.





# పంచతంత్ర కథలు

బుద్ధిమంతుడైన వాడు తన మాట అంటే లక్ష్యం లేనివాడికీ, జూదరికీ, తాగుబోతుకూ, చిక్కులలో ఉన్న మూఢుడికి, ఓటమి చెందినవాడికీ, ఆశాభంగం చెందినవాడికీ హితం చెప్పటం తనకే అపాయమని తెలుసుకుంటాడు. చేవ ఎక్కిన కర్ర విరగనైనా విరుగుతుంది గాని వంగదు గదా! అడిగినవాడికే హితం చెప్పాలి గాని, విశ్వాసం లేనివాడికి చెప్పరాదు.

ఒక వనంలో ఒక పిచ్చుకల జంట ఒక చెట్టు కొమ్మమీద చక్కని గూడు కట్టుకుని ఉంటూండేది. ఒక శిశిరంలో చలితో బాటు వాన కురుస్తున్నది.

అప్పుడొక కోతి వానకు తడిసి, చలికి వణుకుతూ వచ్చి అదే చెట్టుకింద నిలబడింది. దాని శరీరం నిలువునా గజగజలాడుతున్నది. దాని దంతాలు వణుకుతూ టకటకలాడుతున్నాయి.

ఆ సమయంలో గూట్లో ఆడపిచ్చుక మాత్రమే ఉన్నది. అది కోతికి కలిగిన దుస్థితి చూసి, 'ఏమోయ్, నీకు మనిషికున్నట్లే మొహమూ, కాళ్లూ. చేతులూ ఉన్నాయి గదా. మనుషులు కట్టుకున్నట్లే ఒక ఇల్లు కట్టుకోలేకపోయావా? ఎందుకలా చెట్టుకింద నిలబడి, బుద్ధి లేకుండా చలికీ, వానకూ వణికిపోతున్నావు?' అని అడిగింది.

కోతి మండిపడి, 'నా కోసం నేనైతే ఇల్లు కట్టుకోలేని మాట నిజమే కాని, ఇలాటి దుర్మార్గురాలి కొంప పీకటం నా చేతిలో పనే కదా,' అనుకుని పిచ్చుక గూడులాగి, తుంచి ముక్కలు ముక్కలు చేసేసింది.

మిత్రభేదం-**26**



ఆడపిచ్చుక ఎగిరిపోయి ప్రాణాలు దక్కించుకున్నది.

అలాగే సూచీముఖి పిలవని పేరంటంగా కోతికి హితవు చెప్పబోయేసరికి కోతికి ఆగ్రహం వచ్చి, సూచీముఖీని పట్టుకుని రాయికేసి కొట్టి చంపేసింది.

కరటకం దమనకానికి ఈ కథ చెప్పి, 'మూఢుఢికి వివేకం చెప్పటం నిష్ప్రయోజనం. అలాంటి వాడిలో వివేకం జాడీలో దాచి మూత పెట్టిన దీపం లాటిది. నువు పుట్టడమే అలా పుట్టావు. నువు వెనకటి దుష్టబుద్ధి లాటివాడివి.'

'ఏమిటా కథ?' అని దమనకం అడిగింది. కరటకం దుష్టబుద్ధి కథ ఇలా చెప్పింది:

## దుష్టబుద్ధి కథ

ఒక పట్టణంలో దుష్టబుద్ధీ, ధర్మబుద్ధీ అని ఇద్దరు వైశ్యయువకులు ఉండేవారు. ఇద్దరూ మంచి స్నేహితులు. ధర్మబుద్ధి చాలా మంచివాడూ, నిజాయితీపరుడూనూ. కాని దుష్టబుద్ధి అనేక రకాల దుష్ప్రవర్తన కలవాడని ధర్మబుద్ధికి తెలియదు.

అంతులేని తన వ్యసనాలు తీరటానికి పుష్కలంగా డబ్బు సంపాదించగోరి, దుష్టబుద్ధి ధర్మబుద్ధిని వర్తకం కోసం దూర దేశాలకు పోదామని పిలిచాడు.

'కొత్త కొత్త దేశాలు చూసి, మంచి లాభాలు సంపాదించటానికి ఇది మంచి అవకాశం. వయసులోనే ప్రపంచం చూడకపోతే ముసలితనంలో జ్ఞాపకం చేసుకునేటందుకు ఏమీ ఉండదు. ప్రపంచంలో ఎన్ని బాషలున్నాయో, ఎన్ని రకాల వస్త్రధారణలూ, ఆచారాలూ, ఉన్నాయో తెలుసుకోని జన్మ ఏం జన్మ? దేశాంతరాలు చూస్తేనే గాని జ్ఞానమూ, సంపదా, కళా పెంపొందవు. పోదాం పద.' అన్నాడు దుష్టబుద్ధి.

ధర్మబుద్ధి 'సరే' నన్నాడు.

ఇద్దరూ ఒక రోజు పట్టణం నుంచి బయలుదేరి, క్షేమంగా ఒక తెలియని దేశం చేరారు. అక్కడ వాళ్లు పర్యటన చేస్తూండగా, ధర్మబుద్ధికివెయ్యి బంగారు నాణాలు గల పాత్ర నిక్షేపం దొరికింది.

అతను దుష్టబుద్ధితో, 'మన అదృష్టం బాగున్నది. మనం ఇంటికి తిరిగి పోదాం పద.' అన్నాడు.

ధనం కోసమో, విద్యకోసమో, కళ కోసమో దేశాంతరం వెళ్లినవాడికి అది లభించగానే స్వదేశం మీద గాలి మళ్లటం సహజం.

అందుకు దుష్టబుద్ధి వెంటనే ఒప్పుకున్నాడు. ఇద్దరూ స్వదేశానికి తిరిగివచ్చారు.

వాళ్లు తమ ఊరు చేరవస్తుండగా ధర్మ బుద్ధి దుష్టబుద్ధితో, 'మిత్రమా, దొరికిన దానిలో నీ సగం నువు తీసుకో. త్వరలోనే మనం మనవాళ్లను చేరుకుని పండగ చేసుకోబోతున్నాం,' అన్నాడు.

దురాశ మనసులో పెట్టుకున్న దుష్ట బుద్ధి, 'మిత్రమా, ఇంత డబ్బు ఒక్కసారిగా మన బంధువులకూ, స్నేహితులకూ చూపడం అంత మంచిది కాదు. వాళ్లు దాన్ని కోరతారు. అదీగాక వివేకి అయిన వాడు, తనకు కొద్ది సంపదే ఉన్నప్పటికీ, దాన్ని ప్రదర్శించడం అనుచితం. డబ్బు పాపిష్టిది.-అది తపస్వులను సైతం చలింపజేస్తుంది. అది అలా ఉంచి, ఈ బంగారం మన ఉమ్మడి సొత్తుగా ఉన్నంత కాలమూ మన స్నేహబంధం మరింత దృఢంగా ఉంటుంది. అందుచేత ఇప్పుడు మనం చెరొక నూరు నాణాలూ తీసుకుని, మిగిలిన ఎనిమిది వందలూ పాత్రతో సహా అరణ్యప్రదేశంలో రహస్యంగా పాతిపెడదాం. అలా చేయడం వల్ల, ఈ పెన్నిధి మనకు అచ్చివచ్చేదీ లేనిదీ కూడా తెలిసిపోతుంది. మనకు అవసరం కలిగినప్పుడల్లా వచ్చి ధనం కొంచెం కొంచెంగా తీసుకుపోతూ ఉండవచ్చు.'

ధర్మబుద్ధికి అనుమానం కలగలేదు. ఇద్దరూ అరణ్యంలో ఒక నిర్జన ప్రాంతానికి వెళ్లి, అక్కడ నిధిని పాతిపెట్టి తమ ఇళ్లకు తిరిగి ఇచ్చేశారు. (ఇంకా వుంది)





# విమర్శ

త్రిపర్ణ సామ్రాజ్యాన్ని ఏలే చక్రవర్తి విష్ణు వర్ధనుడు సహృదయుడు, సమర్థుడూనూ. రాజ్యవ్యవహారాల్లో కీలక నిర్ణయాలు తీసుకునేటప్పుడు విచక్షణను పాటించగలడని పేరుపొందాడు.

ఒకసారి సర్వసేనాని శూరసేనుడు చక్రవర్తి వద్దకు వచ్చి, 'ప్రభూ! మన సామంత రాజ్యాలలో ఒకటైన రామపురి రాజ్యాన్ని ఏలే అనంతవర్మ ఏలినవారి శాసనాలను విమర్శిస్తున్నట్లు వార్తలు వస్తున్నాయి. కప్పం కట్టడానికి కూడా సవాలక్ష ప్రశ్నలు వేస్తున్నాడు. తమ ఆజ్ఞ అయితే తక్షణమే వెళ్లి అతనికి బుద్ధి చెప్పి వస్తాను,' అన్నాడు.

సేనాని మాటలు విన్న విష్ణువర్ధనుడు, 'అనంతవర్మకు తప్పక బుద్ధి చెప్పవలసిందే. ఎలా చెప్పాలన్నది మేం ఆలోచిస్తాం,' అని అప్పటికి అతడిని పంపేశాడు.

చక్రవర్తి ఆదేశాలకు ఎదురుచూస్తూ, రామపురి మీదకు దండెత్తేందుకు సన్నాహాలను చేసుకోసాగాడు శూరసేనుడు. అంతలో ఓ రోజున అతనికి చక్రవర్తి నుండి పిలుపు రానేవచ్చింది. ఉత్సాహంగా వెళ్లాడు అతను.

విష్ణువర్ధనుడు, శూరసేనుడితో రామాపురం గురించి గాని, అనంతవర్మ గురించి గాని ప్రస్తావించలేదు. 'శూరసేనా! ఉమ్మడి కుటుంబపు వ్యవస్థను గూర్చి అధ్యయనం చేస్తున్నాము మేము. ఆ సందర్భంలో నీ సహకారం కోరి పిలిపించాము,' అన్నాడు.

సామాజిక దృక్పథం కలిగిన చక్రవర్తి విష్ణువర్ధనుడు తరచుగా అటువంటి విషయాలపై అధ్యయనం చేస్తుండటం కద్దు. అందుకే, 'అవశ్యం సెలవీయండి, ప్రభూ!' అన్నాడు శూరసేనుడు.

తిరుమలశ్రీ

‘ఆ అధ్యయనంలో ఓ భాగమైన కుటుంబంలో సామరస్యతను గూర్చి, పరిశీలించేందుకుని వివిధ తరగతులకు చెందిన కొన్ని కుటుంబాలను నమూనాలుగా తీసుకున్నాం మేము. వాటిలో నీదొకటి,’ చెప్పాడు విష్ణువర్ధనుడు.

‘నువ్విప్పుడు చేయవలసిందల్లా ఇంటికి వెళ్లి ప్రశాంతంగా ఆలోచించి.. గత మూడు మాసాల్లోనూ నీ కుటుంబ వ్యవహారాలకు సంబంధించి నువ్వు తీసుకున్న నిర్ణయాలూ, వాటిని నీ కుటుంబంలోని సభ్యులంతా ఏకగ్రీవంగా ఆమోదించిన సందర్భాలూ వగైరా వివరాలన్నీ రాసుకుని వచ్చి మాకు చూపించాలి.’

‘ఓస్, అదెంత భాగ్యం!’ అనుకున్న శూరసేనుడు చక్రవర్తి వద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

మర్నాడు తల వేలాడేసుకుని వచ్చిన సేనానిని చూసి విస్తుపోయాడు విష్ణువర్ధనుడు.

‘మహాప్రభూ! తరచి చూస్తే గత మూడు మాసాలలోనూ నేను చేసిన ప్రతిపాదనలతో, నిర్ణయాలతో నా భార్య కాని, నా ఇద్దరు కుమారులు కాని ఏకగ్రీవంగా అంగీకరించిన సందర్భాలు ఒకటీ ఆరా తప్పితే ఏవీ లేవు,’ అని విన్నవించుకున్నాడు శూరసేనుడు.

విష్ణువర్ధనుడు విస్తుపోతూ, ‘ఆశ్చర్యంగా ఉన్నదే! మరి కుటుంబ పెద్దగా నువ్వేం చేసావ్? వారిని దండించి నీ దారికి తిప్పుకున్నావా లేదా?’ అనడిగాడు.



అందుకు శూరసేనుడు నవ్వి, ‘ఓ పక్క నేను తాళికట్టిన భార్య, మరోపక్క పిల్లలు పసివాళ్లూ, అనుభవ శూన్యులూనూ. నా నిర్ణయాలలోని లోతుపాతులు వారికి ఎలా అర్థమవుతాయి? అందుకే వారికి నచ్చచెప్పడానికి ప్రయత్నించాను. అలా కొన్ని సందర్భాలలో వారి ఆలోచనా సరళిని మార్చగలిగాను. కొన్ని సందర్భాలలో వారి ఆలోచనలకు అనుగుణంగా నా నిర్ణయాలను మార్చుకున్నాను,’ అని జవాబిచ్చాడు.

అప్పుడు విష్ణువర్ధనుడు మందహాసం చేసి, ‘రామపురాధీశుడు అనంతవర్మ విషయంలో నువ్వు చేసిన ఫిర్యాదుకు సమాధానం కూడా ఇదే, శూరసేనా! అనంతవర్మ సామంతుడైనంత మాత్రాన అతడు మనకు బానిస అని అర్థం కాదు. మన సామ్రాజ్య

మనే ఉమ్మడి కుటుంబంలో అతనూ ఒక భాగస్వామిగా ఉంటున్నాడు.

చక్రవర్తి చేసే శాసనాలను విశ్లేషించి విమర్శించే హక్కు సామంతరాజులకు ఉంది. వారు మనకు చెల్లిస్తున్న కప్పమూ, మన సామ్రాజ్యంలో వారూ ఒక భాగమే నన్న సత్యమూ వారికి ఆ హక్కును ప్రసాదించాయి. అందుకు వారిని తప్పు పట్టడం సమంజసం కాదు,' అన్నాడు శాంతంగా.

'ప్రభూ!' అన్నాడు శూరసేనుడు తెల్లబోయి.

'శూరసేనా! ఓ క్షణం అధికారమదం అనే పొరని తొలగించి శాంతంగా ఆలోచిస్తే నీకే బోధపడుతుంది. చిన్నదైన నీ స్వంత కుటుంబంలోనే ఏకాభిప్రాయం కుదరడం అరుదు. భార్యకూ, భర్తకూ కన్నవారికీ సంతానానికీ నడుమనే ఆలోచనలలో ఓ పొందికంటూ కుదరడం లేదు.

అటువంటప్పుడు సామ్రాజ్య పాలనలో రాజకీయపరమైన శాసనాల విషయంలో ఏలికల మధ్య అభిప్రాయభేదాలు తలెత్తడంలో వింత ఏమున్నది? మన శాసనాల పట్ల అనుమానాలు రేగాయంటే ఆ లోపం మనదే ఔతుంది. ఆ సందేహాలను తీర్చవలసిన బాధ్యత మనపైన ఉంది.'

ఓ క్షణం ఆగి సాభిప్రాయంగా సేనాని వంక చూశాడు విష్ణువర్ధనుడు. 'మనకు అధికారం ఉందికదా అని.. విమర్శించిన వారినల్లా శిక్షించాలనుకోవడం అవివేకమే ఔతుంది. అసలు విమర్శలనేవే లేకుంటే మన చర్యలలోని లోటుపాట్లు మనకు ఎలా తెలిసి వస్తాయి? సద్విమర్శలు ఎప్పుడూ ఆరోగ్యకరమే.'

విష్ణువర్ధనుడి నిశిత దృష్టికి, విశాల దృక్పథానికి జోహార్లు అర్పించకుండా ఉండలేక పోయాడు శూరసేనుడు.

'నా అజ్ఞానానికి మన్నించండి, మహాప్రభూ! స్వయంగా రామపురికి వెళ్ళి అనంతవర్మను కలుసుకుంటాను. అతని అనుమానాలనూ, శంకలనూ నివృత్తి చేసి పని సాధించుకుని వస్తాను,' అని చక్రవర్తి వద్ద అనుమతి తీసుకుని నిష్క్రమించాడు.





# వేటగాడు

పంచవని రాజ్యం రాజు విక్రమధీరుడు మహావీరుడు. అయితే అతనికి తనను మించిన వారు లేరన్న అహంకారం జాస్తి.

అతడికి వేటంటే ప్రాణం. వీలు చూసుకుని తరచుగా అరణ్యానికి వెళ్ళి జంతువులను వేటాడేవాడు.

ఎప్పటిలాగే ఒక పర్యాయం విక్రమధీరుడు మెరికల్లాంటి కొంతమంది సైనికులను వెంటతీసుకుని అరణ్యానికి వేటాడటానికి వెళ్ళాడు. ఒక జింక పిల్లను చూసి బాణం గురిపెట్టాడు. అదే సమయానికి దూరం నుంచి ఒక బాణం వచ్చి జింక పిల్లను తాకింది. అది నేలకు ఒరిగింది.

తను గురిపెట్టిన జింక పిల్లను వేటాడినది ఎవరా అని విక్రమధీరుడు బాణం దూసుకొచ్చిన దిశగా చూశాడు. ఒక పొద మాటునుంచి ఒక వ్యక్తి బయటకు వచ్చాడు. అతని వేష ధారణ చూసిన విక్రమధీరుడు అతడు తప్పక వేటగాడు అయి ఉంటాడని భావించాడు. ఆ వేటగాడు మహారాజును సమీపించినంతనే నమస్కరించి, 'మహారాజా! క్షమించండి. మీరు జింక పిల్లకు బాణం గురిపెట్టిన విషయం తెలియకనేను బాణం వదిలాను,' అన్నాడు.

విక్రమధీరుడు కన్నెర్రజేసి, 'ఎవరు నువ్వు 'అని ప్రశ్నించాడు. 'నా పేరు రణమల్లు. పొట్టపోసుకోవడానికి జంతువులను వేటాడుతుంటాను,' అని చెప్పాడతను.

'నేను వేటాడ దలిచిన జింకపిల్లను నీవు వేటాడి పెద్ద తప్పు చేశావు. అందుకు శిక్షగా నీ కుడిచేతి బొటన వేలును నరికిస్తాను.' అన్నాడు విక్రమధీరుడు. 'మహారాజా! తెలియక చేసిన తప్పుకు అంత శిక్ష తగదు. విలుకాడికి కుడిచేతి బొటన వేలు ప్రాణంతో సమానమని మీకు తెలియనిది కాదు,' అన్నాడు రణమల్లు.

ఎస్. శివనాగేశ్వరరావు

'నీవు నన్ను మించిన విలుకాడివా?' అని పరిహసించాడు విక్రమధీరుడు.

'మీరు యుద్ధ భూమిలో ఎంతవీరులో, ఈ అరణ్యంలో నేనంత వీరుణ్ణి,' బదులు పలికాడు రణమల్లు.

విక్రమధీరుడు ఆగ్రహంతో 'తక్షణం వీడి ప్రాణం తీయండి.' అని భటులను ఆదేశించాడు.

భటులు రణమల్లు మీద కత్తులు దూస్తుండగా హఠాత్తుగా ఒక మహా వృక్షం మీదనుంచి భయంకరమైన కొండ చిలువ మహారాజు మీదపడి అతణ్ణి చుట్టేసింది.

మహారాజు, సైనికులు బిత్తరపోయారు. కొండ చిలువ బారి నుంచి తప్పించుకోవడానికి ప్రయత్నం చేశాడు గాని, అతని శక్తి చాలలేదు. సైనికులు, కత్తులు దూసి కూడా కొండ చిలువ మీద దాడి చేస్తే మహారాజుకు మరింత ప్రమాదమని శంకించారు.

ఆ దృశ్యం చూసిన రణమల్లు తక్షణమే విల్లు సంధించి రాజుకు చిన్న గాయమైనా తగులకుండా, కొండ చిలువమీదకు వదిలాడు. దాంతో కొండ చిలువ పట్టు సడలించింది. అదే అదునుగా విక్రమధీరుడు కొండచిలువ బారి నుంచి బయటపడి పరుగున ఇవతలికి వచ్చాడు. రణమల్లు కొండ చిలువను సమీపించి తన మొలనున్న చుర కత్తి తీసి దాని ప్రాణం తీశాడు.

విక్రమధీరుడు, రణమల్లును కౌగలించుకుని, 'అహంకారంతో నిన్ను చులకన చేసి మాట్లాడాను. నీ ప్రాణం తీయించబోయాను. అయినా నీవు నన్ను కాపాడావు. యుద్ధ భూమిలో ఇదే పరిస్థితి నా శత్రురాజుకు వస్తే నేను అతని చావునే కోరతాను. నీలా దయ చూపను. నీవు నా కంటే గొప్పవాడివి. నన్ను మన్నించు,' అని కోరాడు.

అందుకు రణమల్లు, 'మహారాజా! విలుకాడికి చేతి బొటన వేలు ఎంత ముఖ్యమో, మనిషి అనేవాడికి మానవత్వం అంత ముఖ్యం. ఒక మనిషిగా నా ధర్మం నేను నిర్వర్తించాను. అంతే గాని ఇందులో నా గొప్పదనం ఏమీ లేదు,' అని వినయంగా బదులు పలికాడు.

విక్రమధీరుడు తన మెడలోని ముత్యాల హారం తీసి, రణమల్లు మెడలో వేసి అతనికి కృతజ్ఞతలు చెప్పి, వెనుదిరిగాడు.





# తేడా

ఆరోజు ఎదురింటి రోజీ పుట్టినరోజు వేడుకకి వెళ్లి వచ్చిన దగ్గరనుంచి ఇంట్లో ఎవరితోను మాట్లాడకుండా రెండు బుగ్గలమీదా చేతులుంచుకుని దీక్షగా ఏదో విషయాన్ని ఆలోచిస్తూ కూర్చుంది ఆరేళ్ల దీపిక.

దీపిక తండ్రి వెంకటరాజుకి అది చాలా ఆశ్చర్యంగా అనిపించింది. ఒక్కగానొక్క కూతురయిన దీపికను వాళ్లు ఎంతో అపురూపంగా చూసుకుంటారు మరి.

''నువ్వేమయినా దీపూని కోప్పడ్డావా?'' అని అడిగాడు భార్య మైత్రేయిని.

''లేదే... ఎందుకలా అడుగుతున్నారు'' అంది మైత్రేయి భర్తతో.

''మరయితే రోజూ గలగలా నవ్వుతూ ఇల్లుపీకి పందిరివేస్తూ అల్లరి చేసే మన దీపిక ఎందుకంత విచారంగా కూర్చుంది?''

''నేను వంటింటి పనిలోపడి గమనించనేలేదు సుమండీ! ఎదురింటి డాక్టరు గారమ్మాయి రోజీ పుట్టినరోజుకి వెళ్లేటప్పుడు బాగానే ఉందే! పదండి కనుక్కుందాం'' అంది మైత్రేయి.

''ఏమ్మా దీపూ! అలా ఉన్నావేం?'' లాలనగా అడిగిన తండ్రికేసి చూసిన దీపిక కళ్లల్లో ఏదో బాధ కదలాడింది.

''మరేమో రోజీకి ఎన్ని బహుమతులొచ్చాయో నాన్నగారూ! కార్లు, బొమ్మలు, బట్టలు'' అంది రోజీ.

వెంకటరాజుకి విషయం అర్థమయింది.

''అన్నట్టు దీపూ! రేపు బడిలో పాటల పోటీలున్నాయన్నావు. బాగా సాధన చేసావా? ఏదీ ఓసారి పాడి వినిపించుమరి!'' అన్నాడాయన దీపిక దృష్టిని మళ్లిస్తూ...

తను అమ్మ దగ్గర నేర్చుకున్న అన్నమయ్య కీర్తనను తండ్రికి పాడి వినిపిం

ఎ. కొండలరావు

చింది దీపిక. తల్లి ఆ పాటలో ఒకటి రెండు చోట్ల ఎలా చక్కని భావాన్ని పలికించాలో చెప్పి సరిదిద్దింది.

మరునాడు సాయంత్రం వెంకటరాజు వచ్చేసరికి దీపిక గుమ్మందగ్గరే ఎదురయింది. పాటల పోటీలో ప్రథమ బహుమతిగా తనకిచ్చిన 'త్యాగరాజు జీవిత చరిత్ర' పుస్తకాన్ని తండ్రికి చూపించి ఆనందంతో గంతులేసింది.

''ఎంతో ఖరీదు చెయ్యని ఈ పుస్తకం చూసి ఎందుకంత సంతోషం తల్లీ!'' అని అడిగారు వెంకటరాజు నవ్వుతూ.

"మరేమో నాకు బహుమతి ఇస్తూ న్యాయమూర్తి గారు నేను పెద్దయ్యాక ఎంతో గొప్ప గాయనివి అవుతానని మెచ్చుకున్నారుగా.''

''అంటే ఇది నీ ప్రతిభకి గుర్తింపుగా వచ్చిన పుస్తకం అన్నమాట'' అన్నాడు తండ్రి.

''దీనిని భద్రంగా దాచుకుంటాను. ఎంత పెద్దయినా దీనిని నేను మర్చిపోలేను నాన్నగారూ!'' అంది దీపికమెరుస్తున్న కళ్లతో.

చిన్నతనంలో పిల్లలను ప్రోత్సహించడం, వారి ప్రతిభను మెచ్చుకోవడం అనేవి వారిని ఉన్నత స్థానాలకు తీసుకు వెళ్తాయని తెలిసిన వెంకటపతి రాజు కూతురి తల ప్రేమగా నిమురుతూ అన్నారు.

''దీపూ! ఇప్పటికయినా కానుకలకీ బహుమతికీ తేడా తెలిసిందా! కానుకలనేవి మనకి ఇష్టమైన వారు మనమీది ప్రేమతో ఇచ్చేవి. బహుమతి మన స్వయంకృషితో మన ప్రతిభకి గుర్తింపుగా మనం సంపాదించుకునేది. రెండూ సంతోషం కలిగించేవే అయినా మన కష్టం లేకుండా వచ్చేవాటి కంటే మనం కష్టపడి సాధించుకున్న బహుమతులకే ఎక్కువ విలువని నీకు అర్థమయిందిగదా!''

దీపిక బాగా అర్థమయిందన్నట్టు తల ఊపడమే కాకుండా తనకి వచ్చిన బహుమతిని అలాగే అపురూపంగా గుండెకి హత్తుకుని చుట్టుప్రక్కల స్నేహితులందరికి చూపించేందుకు సంబరంగా బయటికి పరిగెత్తింది.





# మహారాజయోగం

బుందేల్ ఖండ్‌లో ఒకప్పుడు ఠాకూర్ వంశంవారు జనరంజకంగా పరిపాలించారు. ఆ వంశానికి చెందిన రూపసింహుడనేవాడు కడు పేదవాడు. అతనికి ధనం గాని, ఆస్తి కాని, చివరకు బంధువులు గాని లేరు. అతనికున్న ఆస్తి యావత్తూ చినిగిపోయిన దుస్తులూ, రెండు గోనె పట్టాలూ, ఒక గొడ్డలీ.

ఈ గొడ్డలితో రూపసింహుడు రోజూ ఉదయం నుంచీ మధ్యాహ్నం దాకా అడవిలో కట్టెలు కొట్టి, వాటిని తెచ్చి మూడు రూపాయలకు అమ్ముకునేవాడు. అందులో రెండు రూపాయలు ఖర్చుపెట్టి చాకలివాళ్ల దగ్గిర రాజులు ధరించే దుస్తులు అద్దెకు తీసుకునేవాడు. మరొక రూపాయికి గుర్రం ఒకటి అద్దెకు తీసుకునేవాడు. ఆ బట్టలు ధరించి గుర్రం ఎక్కి, వాయువేగంతో నగరపు వీధుల వెంట రాజఠీవితో సవారి అయి వెళ్లేవాడు.

మంచి యువకుడూ, అందగాడూ అయిన ఈ వ్యక్తిని చూసి అందరూ అతనెవరో రాజనుకునేవారు. ఈ విధంగా రూపసింహుడు ప్రతిరోజూ ఠాకూర్ రాజ వంశ గౌరవాన్ని నిలబెట్టి, చీకటిపడగానే అద్దె దుస్తులనూ గుర్రాన్ని తిరిగి ఇచ్చివేసి తన మామూలు దుస్తులు ధరించి, చిల్లర డబ్బులతో ఇన్ని మరమరాలూ, శనగపప్పూ కొని తిని, కాసిని మంచినీళ్లు తాగి, ఒక గోనెపట్టా నేలమీద పరుచుకుని, మరొకటి మీద కప్పుకుని నిద్రపోయేవాడు. తిరిగి మర్నాడు ఉదయం

జి. కృష్ణానందశర్మ



గొడ్డలి భుజాన పెట్టుకుని కట్టెలు కొట్ట డానికి అడవికి బయలుదేరేవాడు.

ఒకనాడు రూపసింహుడు అడవిలో కట్టెలు కొడుతూ ఉండగా అతనికి సమీపంనుంచి సువాసన తగిలింది. వెళ్లి చూసేసరికి మంచిగంధపు చెట్టు కనిపించింది.

రూపసింహుడు గొడ్డలితో మంచి గంధపు చెట్టు బెరడు కొంత చెక్కి తీసుకుని, యధాప్రకారం కట్టెలు కొట్టుకుని సాయంకాలానికల్లా నగరానికి తిరిగి వచ్చాడు.

ఆ సాయంకాలం రూపసింహుడు రాజదుస్తులు ధరించి గుర్రంమీద ఎక్కి వాయువేగంతో సవారీ అయి పోతుండగా నగరపు కూడలిలో ఒక పరదేశి అతనికి ఎదురై 'నమస్కారం మహాప్రభూ,' అన్నాడు. 'ఎవరవోయ్ నీవు?' అని తీవిగా ప్రశ్నించాడు రూపసింహుడు.

'ప్రభూ, నేను వ్యాపారం చేసుకునే వాణ్ణి. తమ దేశంలో వ్యాపారం ముగించుకుని పోతున్నాను,' అని విన్నవించుకున్నాడు పరదేశి.

రూపసింహుడు తన జేబులోనుంచి గంధపు చెట్టు బెరడు తీసి, పరదేశికి ఇస్తూ, 'ఠాకూర్ రూపసింహుడి కానుకగా దీనిని సింహళరాజుకు అందజెయ్యి, నీ పని సానుకూలం అవుతుంది!' అని తన గుర్రాన్ని అదిలించి శరవేగంతో వెళ్లిపోయాడు.

ఆ ప్రకారమే వర్తకుడు రూపసింహుడి కానుకను సింహళ రాజుకు అందజేశాడు. గంధపు చెక్క ఎరగని సింహళ రాజు ఆ కానుకకు ముగ్ధుడై, వర్తకుడికి సమస్త సదుపాయాలూ చెయ్యటమే గాక, అతనిద్వారా రూపసింహుడికి రత్నాలు పొదిగిన పాదుకలు బహుమానంగా పంపాడు.

ఆ వర్తకుడు తిరిగి వచ్చి రూపసింహుడి కొరకు నగరు కూడలిలో వేచి ఉండగా రూపసింహుడు గుర్రం మీద వచ్చాడు. 'నమస్కారం, మహాప్రభూ,' అన్నాడు వర్తకుడు.

'ఎవరు నీవు?' అన్నాడు రూపసిం హుడు, గుర్రం ఆపి.

'మహాప్రభూ, నేను పరదేశి వ్యాపా రిని తాము పంపిన కానుక సింహళ రాజుకు అందజేశాను. ఆయన తమకీ పాదుకలు పంపారు,' అన్నాడు వర్తకుడు.

'నీవిప్పుడు ఏ దేశానికి పోతున్నావు?' అని అడిగాడు రూపసింహుడు. 'అరే బియా దేశం వెళుతున్నాను,' అన్నాడు వర్తకుడు.

'అయితే అరేబియా చక్రవర్తికి ఈ పాదుకలను మా కానుకగా బహూక రించు, నీ పని సానుకూలమవుతుంది,' అంటూ రూపసింహుడు గుర్రాన్ని అది లించి, శరవేగంతో వెళ్ళిపోయాడు.

వర్తకుడు అలాగే చేశాడు. అరేబియా చక్రవర్తి రత్నాలు పొదిగిన పాదుకలు చూసి, ఆ అమూల్యమైన కానుకను పంపిన రాజు సామాన్యుడై ఉండడని భావించాడు. అరేబియా దేశపు గుర్రాలు ఉత్తమాశ్వాలు. వాటిలో ఉత్తమోత్తమ మైనవి నూరు తెప్పించి చక్రవర్తి వర్తకు డికి ఇచ్చాడు.

'రూపసింహ ఠాకూర్ గారికి మా సలాములు చెప్పి, ఈ నూరుగుర్రాలు మా కానుకగా వారికి అందజెయ్యి. వారు పంపిన కానుక ఆనందాన్ని కలి గించింది.' అని వర్తకుడికి చెప్పాడు. వర్తకుడు ఆ నూరు గుర్రాలనూ శ్రద్ధగా



వెంటబెట్టుకు వచ్చి మామూలు ప్రకారం కూడలిలో నిలబడ్డాడు. త్వరలోనే రూప సింహుడు గుర్రంమీద వాయువేగంతో వచ్చి వర్తకుణ్ణి చూసి ఆగాడు. వర్తకుడు నూరు అరేబియా గుర్రాలనూ చూసి, 'మహా ప్రభూ, అరేబియా చక్రవర్తి మీకు వీటిని కానుకగా పంపారు. స్వీకరిం చండి!' అన్నాడు.

'నీవిప్పుడు ఏ దేశం పోతున్నావు?' అని అడిగాడు రూపసింహుడు.

'నేను తిరిగి సింహళం పోతున్నాను,' అన్నాడు వర్తకుడు. 'అయితే వీటిని తీసుకుపోయి సింహళరాజుకు మా కానుకగా ఇవ్వు,' అంటూ రూపసిం హుడు వేగంగా వెళ్ళిపోయాడు.

వర్తకుడు నూరు అశ్వాలనూ సింహళ రాజుకు సమర్పించి, 'అది రూపసింహ ఠాకూర్ కానుక' అని విన్నవించాడు.

ఈ కానుక చూడగానే సింహళ రాజు హృదయం ద్రవించింది. రూపసింహుడు పంపే కానుకలు అమూల్యమైనవే కాక, అతని స్నేహం మరింత విలువైనదిగా కనిపించింది. రూపసింహుడు యువకుడనీ, అందగాడనీ, వర్తకుడివల్ల విని సింహళ రాజు తన ఏకైక పుత్రికను అతనికిచ్చి పెళ్లి చేయతలపెట్టాడు. రూపసింహుడి కొరకు రాజోచితమైన దుస్తులూ, ఆభరణాలూ ఇచ్చి, పెద్ద పరివారాన్ని వర్తకుడి వెంట పంపాడు.

రూపసింహుడి నివాసస్థానం తెలియని కారణం చేత వర్తకుడు సింహళ రాజు పంపిన పరివారాన్ని నగర కూడలిలో ఉంచాడు. సాయంకాలం కాగానే, రూపసింహుడు గుర్రంమీద వాయువేగంతో వచ్చాడు. వర్తకుడు రూపసింహుడికి తాను తెచ్చిన సందేశం అందజేశాడు. రూపసింహుడు, ఆ సందేశాన్ని తీసుకుని, 'మర్నాడు అదేచోట కలుస్తాన'ని వర్తకుడికి చెప్పి వెళ్లిపోయాడు.

రూపసింహుడు తన అరువు దుస్తులనూ, గుర్రాన్నీ ఇచ్చివేసి, సింహళ రాజు పంపిన దుస్తులనూ ఆభరణాలనూ ధరించి ఆ రోజు కట్టెలమ్మగా వచ్చిన డబ్బుతో మేనా చేయించుకుని సాయంకాలానికి కూడలికి చేరాడు. అక్కడ వర్తకుడూ, సింహళ రాజు పరివారమూ సిద్ధంగా ఉన్నారు. అందరూ కలిసి సింహళ దేశానికి ప్రయాణమై వెళ్లారు.

సింహళ రాజకుమార్తెకూ రూపసింహుడికి వైభవంగా వివాహం జరిగింది. సింహళ రాజుకు కుమారులు లేనందున, కాలక్రమాన రూపసింహుడే సింహళానికి రాజై చాలా కాలం పరిపాలించాడు.





# రుజువు

సుబ్బరాజుది కొబ్బరికాయల వ్యాపారం. ఆ ఊర్లో ఒకే దుకాణం ఉండటం వలన సుబ్బరాజు వ్యాపారానికి తిరుగులేకుండా పోయింది. లాభాలు తగ్గుతున్నప్పుడల్లా కొత్త కొత్త చిట్కాలు ఉపయోగిస్తూ తన వ్యాపారానికి డోకా లేకుండా చూసుకునే వాడు.

వ్యాపారంలో తనకు తోడుగా కొడుకు సోమరాజును ఉంచుతూ తర్ఫీదు ఇవ్వడం ప్రారంభించాడు. సోమరాజు కూడా తండ్రికి చేదోడు వాదోడుగా ఉండేవాడు.

ఒక రోజు చౌకగా వస్తున్నాయని రెండు వేల కొబ్బరి కాయలు ఒక్కసారిగా కొనేసాడు సుబ్బరాజు. అది చూసిన సోమరాజు 'నాన్నగారూ! ఇవి మంచిరోజులు కావు. ఈ నెలలో పూజలు వ్రతాలకు ముహూర్తాలు కూడా లేవు. అమ్మకంలో ఆలస్యమైతే నిల్వ వలన కుళ్లిపోయే ప్రమాదం ఉంది. ఇలా అయితే నష్టాల్లో కూరుకుపోతామేమో,' అని అనుమానాన్ని వ్యక్తం చేశాడు.

సుబ్బరాజు నవ్వుకుంటూ, 'తెలివి ఉండాలి గాని, ఈ కొబ్బరికాయలన్నీ ఈ రోజే అమ్మకం చేయగలను. అందుకు ఒక చిట్కా కూడా ఆలోచించి ఉంచుకున్నాను,' అన్నాడు.

ఇంతలో దుకాణానికి సుగుణ అనే ఇల్లాలు వచ్చింది. 'కొబ్బరికాయ ఒకటి కావాలి' అని అడిగింది. సుబ్బరాజుకు సుగుణ అంతకు ముందే పరిచయం ఉండటంతో 'ఒక్క కొబ్బరికాయ దేనికమ్మా తీసుకువెళ్తున్నావు?' అని అడగాడు.

'ఇంటికి చుట్టాలు వచ్చారు. పాయసంలో కొబ్బరి కోరు వేసేందుకు,' సమాధానమిచ్చింది సుగుణ.

బి.వి. పట్నాయక్



'నీకీ విషయం తెలియదా?...' అంటూ సాగదీశాడు సుబ్బరాజు.

'ఏ విషయం?' ఆతృతగా అడిగింది సుగుణ.

'దిష్టి కొబ్బరికాయల పూజ విషయం!' చెప్పాడు సుబ్బరాజు.

'ఏమిటా పూజ?' ఆశ్చర్యపోతూ అడిగింది సుగుణం.

'ప్రతి ఇల్లాలు ఇంటి యజమానికి మూడు కొబ్బరి కాయలతో దిష్టి తీసి ఇంటి ముందు కొట్టాలి. అలా చేయకపోతే ఇంటి యజమానికి ప్రమాదం,' అంటూ పూజ విషయం చెప్పాడు సుబ్బరాజు.

'ఎవరు చెప్పారు?' అడిగింది సుగుణ.

'పొరుగూరి జ్యోతిష్కుడు చెప్పాడు. వాళ్ల ఊరు వారంతా ఈ పూజ చేసి సుఖంగా ఉన్నారు. ఇంతవరకు నీ చెవిన పడలేదా?' అడిగాడు సుబ్బరాజు.

'నాకు తెలియదు' అమాయకంగా అంది సుగుణ.

'గ్రహదోష పరిహారార్థం ఈ రోజే ఈ పూజ చేయి. నీ కుటుంబానికి మంచిది. నీకు తెలిసినవాళ్లందరికీ ఈ పూజ గురించి చెప్పు. మనం బాగుంటేనే ఊరు బాగుంటుంది,' అన్నాడు సుబ్బరాజు.

దానితో సుగుణకు ఒళ్లు జలదరించింది. భయంతో మూడు కొబ్బరికాయలు అడిగి డబ్బులు చెల్లించి వెళ్లిపోయింది.

'ఈ పూజ గురించి పొరుగూరు జ్యోతిష్కుడు ఎప్పుడు చెప్పాడు నాన్నా?' అడిగాడు సోమరాజు.

'అదేరా చిట్కా అంటే! మనుషులు మూఢనమ్మకాలకు బానిసలు. నేను వేసిన ఎత్తుతో అందరూ చిత్తు కావలిసిందే చూడు ఇక పెరుగుతుంది కొబ్బరికాయల అమ్మకాల జోరు' నవ్వుకుంటూ గర్వంగా చెప్పాడు సుబ్బరాజు.

'మూఢ నమ్మకాలను ప్రోత్సహించడం తప్పు కదా!' అడిగాడు సోమరాజు.

'అందరికీ ఇది మూఢనమ్మకమైతే నాకు మాత్రం వ్యాపార రహస్యం' అంటూ సమర్థించుకున్నాడు సుబ్బరాజు.

సుబ్బరాజు అనుకున్నట్టే సుగుణ ద్వారా ఈ పూజా విషయం ఊరంతా పాకింది. సాయంత్రంలోపే కొబ్బరికాయలన్నీ అమ్మేశాడు. లాభంగా వచ్చిన రెండువేల వరహాలను చూసి మురిసిపోయాడు.

దుకాణం మూసి తండ్రికొడుకులిద్దరూ ఇంటికి వచ్చారు. ఎదురుగా సుబ్బరాజు భార్య సుమతి వచ్చి 'కొబ్బరి కాయలు తెచ్చారా? దిష్టిపూజ చేయాలి!' అంటూ ఆతృతగా అడిగింది.

'కాయలన్నీ అమ్ముడుపోయాయి. లాభం రెండు వేల వరహాలు మాత్రం తెచ్చాను,' నవ్వుకుంటూ చెప్పాడు సుబ్బరాజు. 'లాభం సంగతి దేవుడెరుగు. మీరు చల్లగా ఉంటే అదే నాకు పదివేలు' అంటూ తాయెత్తును సుబ్బరాజు చేతికి కట్టింది సుమతి. 'ఈ తాయెత్తు ఎక్కడిది?' అడిగాడు సుబ్బరాజు.

'మీకు తెలియదా? గ్రహదోష ఫలితంగా ఇంటి యజమానికి ప్రమాదం కలుగుతుందని ఊరు ఊరంతా చెప్పుకుంటున్నారు. మన అదృష్టం బాగుండి ఒక జ్యోతిష్కుడు ఇంటికి వచ్చాడు. పదివేల వరహాలు ఇచ్చి ఈ తాయెత్తు కొన్నాను. దీని వలన మీకు ఎటువంటి ప్రమాదం ఉండదని చెప్పాడు,' అంది సుమతి.

సుబ్బరాజు కోపంతో ఊగిపోయాడు. 'తాయెత్తు ఎవరు కొనమన్నారు? అవన్నీ ఒట్టి మూఢనమ్మకాలే. తాయెత్తు గురించి అంత డబ్బు ఎందుకు తగలేశావు?' అంటూ భార్యపై విరుచుకు పడ్డాడు.

'నాన్నగారూ! ఇందులో అమ్మ తప్పు లేదు. మూఢనమ్మకాలను ఆచరించడం ఎంత తప్పో ప్రోత్సహించడం కూడా అంతే తప్పు. మీరు చిట్కా పేరున లేవదీసిన పుకారు రెండువేల వరహాలు లాభం తెచ్చిపెట్టింది. అదే పుకారును అవకాశంగా మలచుకుని జ్యోతిష్కుడు అమ్మదగ్గర పదివేల వరహాలు తీసుకుని తాయెత్తును అంటకట్టాడు. మీ పుకారే లేకపోతే పదివేల వరహాలు నష్టం వచ్చేది కాదు,' అంటూ తండ్రిని నిలదీశాడు సోమరాజు.

'ఈ పుకారు లేవదీసింది తమరా?' అంటూ కోపంగా చూసింది సుమతి.

తను స్వార్థం కోసం చేసిన పని తప్పని రుజువైనందుకు సిగ్గుతో తలదించుకున్నాడు సుబ్బరాజు.






# వ్యత్యాసం

చంద్రాపీడుడు కాంచన నగరపు రాజు. ఆయన వద్ద ధవళముఖుడని ఒక సేవ కుడుండేవాడు. ధవళముఖుడు ఏ రోజు కూడా కొలువునుంచి నేరుగా ఇంటికి వచ్చే వాడు కాడు. ఎక్కడో ఒక చోట భోజనం చేసి తాంబూలం వేసుకుని, బాగా పొద్దు పోయింతర్వాత ఇల్లు చేరుకునేవాడు.

ధవళముఖుడి భార్య ఒక రోజు తన భర్తను "మీరు ప్రతిరోజూ ఎక్కడో భోజనం చేసి వస్తారు కదా, ఎవరు మీకు భోజనం పెడతారు? ఎందుకు పెడతారు?" అని అడిగింది.

ధవళముఖుడు భార్యతో, "నాకు ఇద్దరు మంచి స్నేహితులున్నారు. అందులో ఒకడు కల్యాణవర్మ అనేవాడు. అతను నాకు తన వద్ద ఉన్నది ఏది కావాలన్నా ఇస్తాడు. ఇక రెండో వాడు వీరబాహు అనేవాడు. అతను నాకు ప్రాణస్నేహితు డంటే అవసరమైతే నా ప్రాణానికి తన ప్రాణం అడ్డు వేస్తాడు" అన్నాడు.

తన భర్తకు అంత గొప్ప స్నేహితులున్నా రని విని ధవళముఖుడి భార్య చాలా సంతో షించింది. "నాకు మీ మిత్రులను ఒకసారి చూపుతారా?" అని భర్తనడిగింది.

"దానికేం భాగ్యం? రేపు నా వెంటరా, ఇద్దరి ఇళ్లకూ వెళ్లివద్దాం," అన్నాడు ధవళ ముఖుడు.

మర్నాడు ఉదయం భార్యాభర్తలిద్దరూ కల్యాణవర్మ ఇంటికి వెళ్లారు. అతడు వారిని గొప్పగా సత్కరించాడు. తన భర్త చెప్పినదానిలో అతిశయోక్తి లేదని ధవళ ముఖుడి భార్య తెలుసుకున్నది.

టి. భీమారావు

తరవాత ఆ దంపతులిద్దరూ వీరబాహు ఇంటికి వెళ్లారు. చదరంగం ఆడుతున్న వీరబాహు, ధవళ ముఖుడి కేసి ఒకసారి చూసి ''ఏమోయ్, వచ్చావా? కూచో'' అని తిరిగి ఆటలో నిమగ్నుడ య్యాడు.

భార్యాభర్తలు కొంచెంసేపు కూచుని 'వెళ్లివస్తాం,' అన్నారు. వీరబాహు తల ఎత్తకుండానే, 'మంచిది' అన్నాడు.

ధవళముఖుడితో భార్య, 'కల్యాణవర్మ కన్న వీరబాహు మీకు మంచి స్నేహితుడని చెప్పారుగదా, ఇతనికన్న అతనే మనని ఎంతో ఆదరంగా చూశాడే?' అన్నది.

'వారిద్దరి మధ్యా గల వ్యత్యాసం చూడా లంటే, రేపు నువు ఇద్దరిదగ్గరికీ వెళ్ళి, నామీద రాజుగారికి ఆగ్రహం వచ్చిందని చెప్పు,' అన్నాడు ధవళముఖుడు భార్యతో.

ఆమె మర్నాడు ముందుగా కల్యాణ వర్మ ఇంటికి వెళ్లి అతనితో, 'అయ్యా, నా భర్తపై రాజుగారు అలిగారు. మీరు మీ మిత్రుడికి సహాయపడగలరా?' అని అడి గింది. కల్యాణవర్మ హడలిపోయి, 'అమ్మా, నేను వర్తకం చేసుకునేవాణ్ణి. రాజుగారిని ఎదిరించి నేనేం చేయగలను. నీ భర్త దేశం వదిలి పారిపోవడం మంచిది.' అన్నాడు.

ధవళముఖుడి భార్య వీరబాహు ఇంటికి వెళ్లి అతనితో కూడా అదే మాట చెప్పింది. ఈ మాట వింటూనే వీరబాహు డాలూ, కత్తీ పట్టుకుని ఆమె వెంట బయలుదేరి వచ్చి ధవళముఖుడితో, 'మిత్రమా నీమీద రాజుకు కోపం తెప్పించిన తుచ్ఛుడెవడో చెప్పు! వెంటనే ఆ పాపాత్ముడిని హతమా ర్చుతాను!' అన్నాడు ఆవేశంతో.

ధవళముఖుడు నవ్వుతూ, 'కూచో వోయ్. మంత్రిగారు రాజుగారిని నా పట్ల సుముఖుణ్ణి చేశారులే!' అన్నాడు. అతడు వెళ్లిపోయాక, ధవళముఖుడు భార్యతో, 'చూసావు గదా, నా ఇద్దరు మిత్రులలో గల వ్యత్యాసం!' అన్నాడు.





# అపవాదు

పూర్వం గొప్ప ధనవంతుడైన వైశ్యుడుం డేవాడు. ఆయనకు సుబుద్ధి అనే ఒక కుమారుడూ, సుమిత్ర అనే కుమార్తె ఉండేవారు.

ఆయన చనిపోతూ తన కొడుకుని దగ్గరకు పిలిచి. 'నాయనా నా అనంతరం మన వ్యాపారం చక్కగా సాగించు. నీవూ, చెల్లెలూ సఖ్యతగా ఉండండి. ఇదే నా తుదికోరిక,' అని చెప్పాడు.

తండ్రి పోయిన కొద్దికాలానికే సుబుద్ధి మూడు నౌకల మీద సరుకులు వేసుకుని దేశాంతరాలకు బయలుదేరాడు.

బయలుదేరేటప్పుడు అతను తన చెల్లెలితో, 'చెల్లీ, నేను చాలాకాలానికి గాని ఇంటికి తిరిగిరాను. నేను లేని సమయంలో నీవు నీ ధర్మాన్ని అతిక్రమించవద్దు. పరులతో ఎన్నడూ ప్రసంగించవద్దు,' అని చెప్పాడు. తిరిగి ఎప్పుడు కలుసుకుంటామోనని సుబుద్ధి తన చిత్తరువును తన చెల్లెలికిచ్చి ఆమె చిత్తరువును తన వెంట తీసుకుని నౌకలతో సముద్రంమీద బయలుదేరాడు.

రెండేళ్లు గడిచాయి. మూడో ఏడు నడుస్తోంది.

సుబుద్ధి నౌకలు ఒకానొక రేవు పట్టణం చేరుకున్నాయి. అక్కడ లంగరు దించి, తన వెంట ఒక గిన్నెలో రత్నాలూ, రత్నకంబళాలూ మొదలైన బహుమానాలు తీసుకుని సుబుద్ధి ఆ దేశపు రాజు సుదర్శనుడి వద్దకు వెళ్లాడు.

తాను తెచ్చిన బహుమతులు సుదర్శనుడికి సమర్పించి, 'తమ దేశంలో

కె. బాలసుబ్రహ్మణ్యం



వ్యాపారం చేసుకోవడానికి అనుమతి ఇవ్వండి,' అని సుబుద్ధి అడిగాడు.

సుబుద్ధి తెచ్చిన బహుమానాలు చూసి సుదర్శనరాజు చాలా ఆనందించాడు. ఏ వణిజుడు కూడా తన కలాటి అమూల్యమైన బహుమతులు ఇచ్చివుండ లేదు.

అందుచేత సుదర్శనుడు సుబుద్ధి కోరిన ప్రకారం వ్యాపారం చేసుకునేటందుకు అనుమతి ఇవ్వటమే కాక, అతను నౌకలో తెచ్చిన వస్తువులను చూడడానికి సపరివారంగా రేవుకు కూడా వచ్చాడు.

నౌకలోని వస్తువులను చూసి ఆనందిస్తున్న సుదర్శనరాజు కన్ను సుమిత్ర చిత్తరువుపై పడింది.

'ఎవ్వరీ సుందరవతి?' అని సుదర్శన రాజు సుబుద్ధిని అడిగాడు.

'ప్రభూ, ఆమె నా చెల్లెలు.'

'అందానికి తగిన శీలం కూడా ఆమె కున్నదా?' అని అడిగాడు సుదర్శన రాజు.

'ఆమె శీలానికి వంక పెట్టగలవారు లేరు, అన్నాడు సుబుద్ధి.

'అయితే నేనామెను నా పట్టమహిషిగా చేసుకుంటాను,' అన్నాడు సుదర్శనుడు. ఇదంతా ఆలకిస్తున్న సేనానికి అసూయ జనించింది.

'చివరకు ఈ వైశ్యాంగన మాకు రాణి కావడమా? మా భార్యలు ఈమెకు సేవ చేయడమా?' అనుకున్నాడు దుర్మార్గుడైన సేనాని. అతను పైకి మాత్రం ఈ విధంగా అన్నాడు.

'ప్రభూ, ఈ స్త్రీని నేను బాగా ఎరుగుదును. ఆమె దుశ్శీల.'

ఈమాట వినగానే సుదర్శనుడికి సుబుద్ధిపై ఆగ్రహం కలిగింది.

'దుశ్శీలను శీలవతి అని ఎందుకు చెప్పావు? నీ తల తీయించేస్తాను,' అన్నాడు రాజు సుబుద్ధితో.

'ప్రభూ, మీ సేనాని చెప్పేది అసత్యం. చేతనైతే అతను ఆ మాటలు రుజువు చేసుకోమనండి. నా చెల్లెలిని ఎరుగుదునంటున్నాడు కాబట్టి, ఆమె వేలి ముద్రికను తీసుకురమ్మనండి, ఆమె పుట్టు




మచ్చ ఎక్కడ ఉన్నదీ తెలుసుకు రమ్మనండి,' అన్నాడు సుబుద్ధి.

సుదర్శనుడికి ఇది న్యాయంగానే తోచింది. ఆయన తన సేనానితో, 'రెండు నెలలకాలంలో నీవు ఈ స్త్రీ ఉంగరమూ పుట్టుమచ్చ రహస్యమూ తెలుసుకొనలేకపోయినట్లయితే నీ తల తీయించేస్తాను.' అని తెలియపరిచాడు.

సేనాని వెంటనే ప్రయాణమై సుమిత్ర దేశానికి వచ్చాడు. అక్కడ ఒక పేదరాసి పెద్దమ్మ వద్దకు వెళ్లి తను వచ్చిన పని చెప్పి, 'పెద్దమ్మా, నాకా పిల్ల పుట్టుమచ్చ రహస్యమూ ఉంగరమూ తెచ్చిపెడితివా, నీకు అంతులేని బంగారం ఇస్తాను.' అని ఆశపెట్టాడు.

పేదరాశి పెద్దమ్మ ధనాశ చేత సుమిత్ర ఇంటికి వెళ్లి ఆమెతో ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెప్పి, ఆమె వీపుమీద ఎడమ వైపున పుట్టుమచ్చ ఉన్నట్లు తెలుసుకుని, ఆమె ఉంగరాన్ని కూడా తస్కరించి తెచ్చి సేనానికి ఇచ్చింది.

సేనాని వెంటనే ప్రయాణం కట్టి స్వదేశానికి తిరిగివచ్చి సుదర్శనుడికి సుమిత్ర ఉంగరమూ, పుట్టుమచ్చ రహస్యమూ తెలియజేశాడు.

సుమిత్రపై చేసిన అపవాదును సేనాని రుజువు చేశాడు గనక సుదర్శనుడు కోపంతో సుబుద్ధికి మరణదండన విధించాడు.

కాని సుబుద్ధి ఒక్క కోరిక కోరాడు.

'నేనీ దూరదేశంలో మరణించే ముందు ఒక్కసారి నా చెల్లెలిని చూడాలని ఉన్నది. ఆమెను పిలిపించి ఒక్కసారి కలుసుకోనివ్వండి. తరువాత నిశ్చింతగా మరణదండన అనుభవిస్తాను.'

దీనికి సుదర్శనుడు అంగీకరించాడు. సుబుద్ధి తన చెల్లెలి కొక లేఖ రాసి సుదర్శనుడి దూతల ద్వారా ఆమెకు పంపాడు.

తన అన్న చెప్పినట్లు నడుచుకోక పేదరాసి పెద్దమ్మతో మాట్లాడినందుకు ప్రమాదం సంభవించిందని తెలుసుకుని సుమిత్ర తన అన్నను కలుసుకోవ

డానికి బయలుదేరింది. సుదర్శనుడి రాజ్యం చేరుకోగానే, ఆమె తిన్నగా రాజువద్దకు వెళ్లి, 'ప్రభూ, ఈ కర్ణాభరణం చూడండి. ఇది విలువయిన దేనా?' అని అడిగింది.

సుదర్శనుడు ఆమె ఇచ్చిన కర్ణాభరణంలోని రత్నాలను పరీక్షించి, 'నిశ్చయంగా ఇది అమూల్యమైనదే. కాని దీనిని నాకెందుకు చూపుతున్నావు.' అని ఆశ్చర్యంగా అడిగాడు.

'తమ సేనాని దీని జతను నా వద్ద తస్కరించాడు.

తాము ధర్మస్వరూపులు. ఇది నాకు తిరిగి ఇప్పించండి.' అన్నది సుమిత్ర దీనంగా.

రాజు సేనానిని పిలిపించి సుమిత్ర చేసిన ఆరోపణలను చెప్పి, 'ఈమె కర్ణాభరణం దొంగిలించావట. దానిని వెంటనే ఆమెకు తిరిగి ఇచ్చెయ్యి,' అన్నాడు.

సేనాని నిర్ఘాంతపోయి, 'ప్రభూ, అసలీమె ఎవరో నేనెరగను. నా జన్మలో ఎన్నడూ నేనీమె ముఖమైనా చూసి ఉండలేదు. నేనీమె కర్ణాభరణం దొంగిలించటమేమిటి?' అన్నాడు.

వెంటనే సుమిత్ర రాజు సుదర్శనుడి వైపు తిరిగి, 'ప్రభూ! నేను సుబుద్ధి చెల్లెలు సుమిత్రను. నన్ను మీ సేనాని తన జన్మలో ఎన్నడూ చూసి ఉండక పోతే, మా అన్నకు తమరు మరణదండన ఎందుకు విధించారో సెలవివ్వండి?' అని ప్రశ్నించింది.

తన సేనాని చేసిన మోసమూ, సుమిత్ర చేసిన యుక్తీ సుదర్శనుడికి అర్థమైపోయింది.

ఆయన తన సేనానికి మరణదండన విధించి, సుబుద్ధిని ఖైదు నుండి విడిపించి, సుమిత్రను పెళ్లాడి చాలాకాలం సుఖంగా రాజ్యం చేసాడు.






# దుర్జనుల సఖ్యం

ఒక ఊళ్లో ఒక సన్యాసి ఉండేవాడు. ఊరి చివర ఒక కుటీరంలో ఆయన నివశిస్తూ ఉండేవాడు. ఆయన భక్తులు కొందరు నిత్యమూ ఆయనకు పళ్లూ, ఫలహారాలూ, భోజనమూ తెచ్చి సమర్పించి పోతూ ఉండేవారు. వీటితో ఆయన జీవిస్తుండేవాడు. ఒకవేళ ఏనాడైనా ఎవరూ రాకపోతే ఆ రోజు సన్యాసి పస్తుండేవాడేగాని భోజనం లేదని విచారించేవాడు కాడు. సన్యాసి అప్పుడప్పుడూ ఉపవాసాలుంటున్నాడని తెలిసి ఒక భక్తుడు గేదెనొకదానిని తెచ్చి సన్యాసికిచ్చాడు. అది కూడా ఆ కుటీరంలోనే ఉండి సన్యాసికి పాలిస్తూ ఉండేది.

సన్యాసి కుటీరంలో ఉన్న గేదెను కాజెయ్యాలని ఒక దొంగకు ఆలోచన కలిగింది. ఇదేమంత కష్టసాధ్యమైన పని కాదు. కుటీరం ఊరిచివర ఉన్నది. దానికి పెద్ద రక్షణ ఏమీలేదు. ఆఖరుకు తలుపుకు గొళ్లెం కూడా లేదు. సన్యాసి నిద్రించే సమయంలో లోపల జొరబడి గేదెను విప్పి నిశ్చింతగా తోలుకుపోవచ్చు. అందుచేత ఒక చీకటిరాత్రి దొంగ, సన్యాసి కుటీరానికి బయలుదేరాడు.

దారిలో దొంగకు మరొకడు తటస్థపడి వెంట రాసాగాడు. 'ఎవరవు నువ్వు? నా వెంట ఎందుకు వస్తున్నావు? నేను వేరే పనిమీద పోతున్నాను. నీ దారిన నువు పో!' అన్నాడు దొంగ.

దానికా రెండో మనిషి, 'నేను భూతాన్ని, ఊరిచివరి కుటీరంలో ఉన్న

పి. లక్ష్మీపతి

సన్యాసిని చంపటానికి పోతున్నాను. ఈ సన్యాసి ఈ ఊరికి వచ్చింది మొదలు జనం మంచిగా ఉంటున్నారు. అందు చేత వ్యాపారం బొత్తిగా అడుగంటు తోంది. ఊళ్లో అన్యాయాలూ, అక్ర మాలూ, దౌర్జన్యాలూ ఏ మాత్రం లేకుం డాపోయాయి. అందుచేత ఈ సన్యాసిని చంపి ఊరిమీద మళ్లీ నా పెత్తనం సాగిం చుకుంటాను. నీ ప్రయాణం ఎందాకా?' అని అడిగాడు.

'నా వృత్తి దొంగతనం. నేనూ ఆ సన్యాసి కుటీరానికే పోతున్నాను. కాని నా ఉద్దేశం సన్యాసిని చంపటం కాదు. ఆ సన్యాసికొక భక్తుడు పాడిగేదె నొక దానిని ఇచ్చాడు. దానిని దొంగిలించబో తున్నాను,' అన్నాడు దొంగ.

భూతమూ దొంగా సన్యాసికి హాని చేద్దామని ఒకేచోటికి పోతున్నారు గనుక, వారికి సఖ్యం కుదిరింది. స్నేహితుల్లాగా చేతులు కలుపుకుని వారు అర్ధరాత్రి వేళ సన్యాసి కుటీరం చేరారు. ఎక్కడా చడీచప్పుడూ లేదు. సన్యాసి కుటీరంలో పల నిద్రపోతున్నాడు. దొంగ తనలో తాను ఈవిధంగా ఆలోచించుకున్నాడు.

'ముందుగా ఈ భూతం సన్యాసిని చంపబోయే పక్షంలో సన్యాసి అరిచి అల్లరి చేసినట్లయితే నలుగురూ చస్తారు. ఆ తరవాత నేను గేదెను దొంగ లించడం సాధ్యపడదు. అందుచేత నేనే ముందు నా పని ముగించుకోవడం మంచిది. తరువాత భూతం దాని చావు చస్తుంది. నాకేం!'



అదే సమయంలో భూతం కూడా తనలో ఇలా ఆలోచించసాగింది. 'ఈ దొంగ ముందుగా గేదెను దొంగిలించ టానికి యత్నించినట్టయితే గేదె అరవ వచ్చు. సన్యాసి లేస్తాడు. కేక వేస్తాడు. నలుగురూ వస్తారు. అప్పుడు నేను సన్యాసిని హత్య చేయటం సాధ్యం కాదు.'

పైకి భూతం దొంగతో ఈ విధంగా అన్నది, 'తమ్ముడూ, ముందు నేను సన్యాసిని చంపేస్తాను. ఆ తరవాత నువు నిశ్చింతగా గేదెను తోలుకుపో. నిన్నడ్డే వారే ఉండరు.'

దానికి దొంగ 'అలా కాదు అన్నా, ముందు నన్ను గుట్టు చప్పుడు కాకుండా గేదెను తోలుకుపోనీ, తరువాత నువు సన్యాసిని యథేచ్ఛగా చంపుదువు గాని. నాది చాలా చిన్నపని!' అన్నాడు.

ఇద్దరూ వాదించుకోసాగారు. వాదన తగువుగా మారింది. మొదట రహస్యంగా మాట్లాడుకున్న వారు క్రమంగా గొంతు ఎత్తి 'నేను ముందు అంటే నేను ముందు' అని అరవసాగారు. అది రాను రాను పెడబొబ్బల కిందికీ మారింది.

చివరకు దొంగ ఎలుగెత్తి, 'ఏమయ్యోయ్ సన్యాసీ, ఇదుగో భూతం వచ్చింది చూడు, నిన్ను చంపడానికి!' అని అరిచాడు. భూతం అంతకన్న కోపంగా, 'ఇదుగోనయ్యోయ్, సన్యాసి దొంగ, నీ గేదెను కాజేస్తాట్ట,' అన్నది.

ఈ అల్లరికి సన్యాసి మాత్రమే కాక చుట్టుపక్కల ఇళ్లవాళ్లు కూడా కర్రలు, కత్తులూ పట్టుకుని పరిగెత్తుకుంటూ వచ్చారు. వారిలో కొందరు పారిపో చూస్తూన్న దొంగను పట్టుకున్నారు. ఒక భూతవైద్యుడు భూతాన్ని అక్కడే బంధించి మారణ హోమం చేశాడు.

దుర్జనుల మధ్య సఖ్యత ఎంతో కాలం నిలవదు.





# అట్టమీద బొమ్మ

## బృందావనానికి గోపుల వలస

ఈ చిత్రం 1949 జూలై చందమామ సంచికలోనిది. చందమామ అలనాటి ప్రియతమ చిత్రకారులు ఎంటీవీ ఆచార్య గారు కృష్ణావతారం ధారావాహికలో భాగంగా ఈ బొమ్మను గీశారు. హిందూ పురాణాలలో కృష్ణావతారం ఒక రమణీయ గాథ. ఎన్ని సార్లు విన్నా, చదివినా మరపు రాని, మర్చిపోలేని కమనీయ గాథల్లో ఇది ఒకటి.

గోకులంలో బాలకృష్ణుని బతుకు దినదిన గండమయి పోయింది. కృష్ణుని చంపటానికి కంసుడు ఎన్ని ఎత్తులైనా వేస్తూనే ఉన్నాడు. కంసుని ఆజ్ఞప్రకారం మాయ పూతన తన విషపు పాలిచ్చి కృష్ణుని చంపటానికి ప్రయత్నించింది. ఎత్తుకంటా ఎగురవేసుకు పోయి, కృష్ణుని చంపబోయింది. బండి రూపంలో వచ్చి, శకటాసురుడు కృష్ణుని చంపటానికి యత్నించాడు. ఎత్తుకంటా ఎగురవేసుకపోయి, కృష్ణుని చంపుదామని తృణావర్తుడు వాయురూపం దాల్చాడు.

ఇన్ని గండాలు చుట్టుకున్నప్పటికీ, ఆ విష్ణుమూర్తి దయవల్లనే అవన్నీ తొలగిపోతూ వచ్చాయి. కాని, ఇలా భయంతో ఎన్నాళ్లు బతకటం? ఈ ప్రశ్నను ఊరి పెద్దలంతా కలిసి ఆలోచించారు. అందులో ఒక బుద్ధిమంతుడు--

'అబ్బాయిలూ! ఈ ఊరిలో మన కష్టాలు గట్టెక్కే దారి కనబడదు. స్థలం మార్చినట్లయితే మేలు కలుగుతుందని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ఇక్కడికి కొద్దిదూరంలో, బృందావనం అనే ప్రదేశం ఉన్నది. ఆ కొండలూ, నదులూ, పచ్చిక బయళ్లూ కనుపండువుగా ఉంటాయి. పైగా, మన పశువులకు కావలసినన్ని గోభూములున్నాయి. అన్ని సదుపాయాలూ గల బృందావనం వాసయోగ్యమైందనీ , మనకు క్షేమకరమైందనీ నా ఉద్దేశం,' అని చెప్పాడు.

ఈ ఉపాయం విని అందరూ భేష్ ! భేష్!! అని పొంగిపోయారు. ఆ వెంటనే గోకులంలో ఉండే బళ్లన్నీ సిద్ధమైనాయి. పిల్లలూ వృద్ధులూ, ఆడవాళ్లూ బళ్లెక్కారు. మరికొన్ని బళ్ళల్లో సామానులు నింపారు. భజనలతో భాజా భజంత్రీలతో, హరినామస్మరణ చేసుకుంటూ గోపులు, గోపికలతో సహా గోకుల ప్రజలు బృందావనానికి బయలు దేరారు.

ఈ 2012 జనవరి నెలతో మనం కూడా శుభప్రదమైన జీవితంపై కోటి ఆశలతో నూతన సంవత్సరంలోకి అడుగుపెడుతున్నాము. మా పాఠకులందరికీ ఈ సంవత్సరం శుభకరంగా ఉంటుందని ఆశిస్తున్నాము. ఫిబ్రవరిలో కూడా చందమామ దిగ్గజ చిత్రకారులు చిత్రించిన మరొక చిత్రం, కథతో కలుసుకుందాము. జై శ్రీకృష్ణ. – సౌమ్యా భరద్వాజ్



# మోక్షగామి

వైశాలీ నగరంలో శంభుడూ, నారాయణుడూ అనే ఇద్దరు స్నేహితులు ఉండేవారు. 'జీవితంలో మనం చేయవలసింది అంతా చేసేశాం. వానప్రస్థధర్మం పాటిస్తూ, కుటుంబ వ్యవహారాలలో తల దూర్చకపోయినా విపరీత పరిస్థితుల్లో కలుగజేసుకోక తప్పదు. అందుకని హిమాలయాలకు పోయి మోక్షసిద్ధి కోసం తపస్సు చేసుకుందాం, పద' అని శంభుడు పదే పదే పోరసాగాడు. నారాయణుడు చాలా కాలం తాత్సారం చేసి చివరికి సన్యాసానికి ఒప్పుకున్నాడు. ఇద్దరూ దీక్ష పుచ్చుకుని హరిద్వార్ సమీపంలోని ఓ తపోవనంలో తపస్సు ప్రారంభించారు.

కొన్నేళ్ల కఠోర తపస్సు తర్వాత భగవంతుడు శంభుడి ముందు ప్రత్యక్షమై, 'వరం కోరుకో!' అన్నాడు. 'దేవా జీవితమంటేనే అలసట పుట్టింది. బ్రతికి ఉన్నంతకాలమూ తెలిసీ ఎవరికీ అపచారం చెయ్యలేదు. నాకు మోక్షాన్ని ప్రసాదించు స్వామీ!' అని కోరాడు శంభుడు. 'వెర్రివాడా! శక్తి, పదార్థాల సమతుల్యం కోసం విశ్వంలో జనన మరణాలు సృష్టించబడ్డాయి. మోక్షమంటే గతజన్మల వాసనలూ లేకుండా, ఆత్మల్ని పుటం పెట్టి తిరిగి జన్మల్ని ప్రసాదించడం జరుగుతుంది. మోక్షమంటే జన్మరాహిత్యమనే భ్రమలో చాలామంది ఉంటారు. ఇలాంటి మోక్షమే కావలిస్తే అలాగే ప్రసాదిస్తాను' అన్నాడు భగవంతుడు.

'ధన్యుణ్ణి స్వామీ! మీ రుణం ఎలా తీర్చుకోగలను?' అని అడిగాడు శంభుడు.

'నా రుణం తీర్చాలంటే జన్మలు తప్పవు మరి! సరే, నీ స్నేహితుడు ఏమంటాడో చూద్దాం పద. నా వెంటే రా. అతనికి నువ్వు కనబడవులే,' అన్నాడు భగవంతుడు.

భగవంతుడు ఎదుట నిలబడి వరం కోరుకోమనగానే నారాయణుడు భక్తితో నమ

పి.వి. రమణరావు

స్కరించి ప్రార్థించాడు. 'ప్రభూ! యుక్తాయుక్త విచక్షణతో జీవితాలు కొనసాగించవలసిందిగా నీవు మానవులకు వాక్కునీ, జ్ఞానాన్నీ ప్రసాదించావు. అయితే ఇంద్రియ స్వభావాలతో మనసు చంచల గతిని ప్రవర్తించే కారణంగా జీవిత సాఫల్యాన్ని పొందే వీలు కాలేదు. దివ్యమైన ఆత్మానందాన్ని, కోరికలు పట్టి లాగే ఈ శరీరంతో పొందలేకుండా ఉన్నాను...'

భగవంతుడు మధ్యలో కలుగజేసుకుని, 'మోక్షాన్ని కోరుకో!' అన్నాడు. 'నీలో ఐక్యమైపోయిన తర్వాత నేను అన్న భావన లేకపోతే ఆ ఆనందాన్ని అనుభవించే మార్గమే లేదు కదా? అందుకని నాకు మోక్షం వద్దు!'

'మరేం కావాలి?' భగవంతుడు నవ్వుతూ ప్రశ్నించాడు. 'నాకు మరల మరల పునర్జన్మలనివ్వు. ఆరోగ్యకరమైన శరీరాన్ని ప్రసాదించు. చిత్తచాంచల్యానికి లొంగు బాటు కాని మనస్సు ప్రసాదించు. సత్య మార్గాన పయనిస్తూ నిత్యమూ పరోపకారం చేసే సద్బుద్ధిని కలిగించు. ప్రతి జన్మలోనూ నీ దివ్యనామస్మరణం చేస్తూ అలౌకికా నందం పొందేటట్టు అను గ్రహించు. మోక్షం కోరి నీలో ఐక్యమైపోతే నేను సమాజానికి చేయగలిగింది ఏమీ ఉండదు కదా?'

'అలాగే కానివ్వు. నీ చిత్తశుద్ధి నాకు నచ్చింది. పలాయనవాదంతో మోక్షసిద్ధి కోరుకునేవారికంటే ప్రాపంచిక విషయాలలో మునిగి తేలుతూనే, సన్మార్గాన్ని వీడకుండా, లోకకల్యాణం కోసం పాటుపడే మానవుల అవసరం నాకూ ఉంది. నీ ఇష్టప్రకారమే జరుగుతుంది!' అంటూ భగవంతుడు అక్కణ్ణుంచి అదృశ్యమయ్యాడు.

'ఏమంటావ'ని శంభుణ్ణి తర్వాత ప్రశ్నించాడు భగవంతుడు.

'మోక్షంలోనూ ఇన్ని మెలికలున్నాయని ఇప్పుడే తెలిసింది. నారాయణ ఆలోచన బాగుంది. మీ రుణం తీర్చుకోవడానికి జన్మలు తప్పవని మీరే సెలవిచ్చారు కదా, అలాగే దీవించండి!' అన్నాడు శంభుడు.

'తథాస్తు!' అంటూ భగవంతుడు అదృశ్యమయ్యాడు.



# వీరయ్య వీలునామా

వేమవరంలో వీరయ్య అనే రైతు స్వయంశక్తితో ఆరెకరాల మాగాణీ సంపాదించుకున్నాడు. వీరయ్య కొడుకు రామచంద్రానికీ, కూతురు లక్ష్మీదేవికీ పెళ్లిళ్లు ఐపోయాయి. పండుగలకు పబ్బాలకూ అత్తమామలు కూతురికీ కొత్త బట్టలవీ పెడుతుండటం, రామచంద్రం భార్య కాంతామణికీ ఇష్టముండేది కాదు. 'చూస్తూ కూర్చుంటే రేపు మనకు కలుగబోయే సంతానానికి ఏమీ మిగలదు. ఏదో వంకతో మీరూ మీ నాన్న దగ్గరనుండి కొద్దో గొప్పో వసూలు చేసుకోవడం మంచిది,' అంటూ భర్తకు సలహా ఇచ్చింది.

రామచంద్రం తాను చేసే పొగాకు వ్యాపారంలో పెట్టుబడికనో, నష్టం వచ్చిందనో, అప్పులు తీర్చాలనో సాకులు చెబుతూ తండ్రి దగ్గరనుండి పెద్ద మొత్తాలనే తీసుకుపోతూండేవాడు. పొలం తాకట్టు పెట్టో, కొంత అమ్మేసో సొమ్ము తెచ్చి కొడుక్కి ఇస్తూండేవాడు వీరయ్య. ఇచ్చిన ప్రతి పైసా జాగ్రత్తగా లెక్కలు రాసేవాడు. ఓసారి ఆ లెక్కలు చూసుకుంటే, ఆస్తిలో సగం కొడుకు అవసరాలకే ఖర్చు ఐపోయినట్లు తేలింది.

ఓ రోజు రాత్రి వీరయ్య పొలం నుండి తిరిగి వస్తూంటే పాము కరిచి అక్కడికక్కడే మరణించాడు. పెద్ద కర్మ పూర్తయ్యాక పెద్దల సమక్షంలో తండ్రి వీలునామాను బైటకు తీయించారు రామచంద్రం, అతని భార్యాను. అందులో ఇలా ఉంది. 'ఆస్తంతా నా స్వార్జితం.. అందులో సగం నా కొడుకు అవసరాల కోసం ఖర్చు చేయడం జరిగింది. మిగిలివున్న పొలాన్ని నా భార్య రాజలక్ష్మికి, నా కూతురు లక్ష్మీదేవికి సమానంగా ఇస్తున్నాను. ఇంటిని నా భార్యకు. నా కుమారుడు రామచంద్రం వ్యాపారం నిమిత్తం నా దగ్గరనుండి తీసుకున్న సొమ్మంతా అతనికీ.. మనస్ఫూర్తిగా రాసి ఇస్తున్నాను.'

అతి తెలివితో మామగారిని మోసం చేయాలనుకున్న కాంతామణి, వీరయ్య అత్యంత తెలివిగా వీలునామా రాసి తమకు బుద్ధి చెప్పడంతో లబోదిబోమంది. – విశ్వమోహిని





# శిథిలాలయం - 22

(అఘోరీలు శిఖిముఖితో రాజీమాటలు మాట్లాడి తమ దారిన వెళ్లిపోయారు. రాత్రివేళ శత్రువులు తమమీదికి దొంగచాటుగా వదిలిన చిరుతపులిని శిఖిముఖివాళ్లు చంపారు. వాళ్లకు, సాయపడిన జాంగ్‌లాను, గాయపడిన వాడి మిత్రుడు ఎక్కడున్నదీ తెలుసుకు నేందుకు, ముందుండి దారి తీయమని శిఖిముఖి ఆజ్ఞాపించాడు. తరవాత --)

కాగడాకాంతిలో శిఖిముఖీవాళ్లు పొదల పక్కగా నడుస్తూ, గాయపడిన శత్రువు కోసం వెతకసాగారు. వారికొక పొద దగ్గిర నెత్తురు మరకలు కనిపించినై, అక్కడ విరిగిన కొన్ని చెట్టు రెమ్మలూ, ఆకులూ చెల్లాచెదురుగా పడి ఉన్నవి.

'కేసరీ, వాడు నీ బాణం దెబ్బతిన్నది, ఈ పొద దగ్గిరే. కాని, ఎలాగో ఇక్కణ్ణుంచి పారిపోగలిగాడు. తెల్లవార వస్తున్నది. ఇంకా ఇక్కడ కాలయాపన చెయ్యటం ఎందుకు? ప్రయాణసన్నాహాలు చేద్దాం.' అన్నాడు శిఖిముఖి.

'మన ప్రయాణానికి దారి చూపి సాయపడేవాడెవడు? ఈ జాంగ్‌లా శత్రు పక్షం వాడని తేలిపోయింది కదా?' అన్నాడు విక్రమకేసరి.

'ఏ పక్షంవాడయినా, వీడు ప్రస్తుతానికి మన ఆధీనంలో ఉన్నాడు. కామాఖ్య నగరం నుంచి బయలుదేరేటప్పుడు, వీడు మనను ఇభ్యుజాతి వాళ్లు నివసించే గోల్‌భరా గ్రామం చేరుస్తానని మాట ఇచ్చాడు. ఆ పని వీడిచేత చేయించుదాం,' అన్నాడు. శిఖిముఖి. 'ఇంకా ఈ దుర్మార్గుణ్ణి నమ్మటమా? మనను

దాసరి సుబ్రహ్మణ్యం



తప్పు దారి పట్టించి ఆ శిథిలాలయ పూజారికి ఒప్పచెప్పగలడు!' అన్నాడు విక్రమకేసరి.

'అలాంటి భయం ఏమీ లేదు. ఏదైనా మోసం చేయబోతున్నట్లు అనుమానం కలిగిన మరుక్షణం, ఈ జాంగ్‌లాను కత్తితో ముక్కలు ముక్కలుగా నరుకుతాను, మనకొచ్చిన చిక్కేమిటంటే, ఈ మహారణ్యాల్లో నదీలోయల్లో వీడు తప్ప, దారి చూపగలవాడు మరొకడు లేడు. వీణ్ణే అందుకు ఉపయోగించుకోక తప్పదు.' అన్నాడు శిఖిముఖి.

'ఆ ఉపయోగించుకోవడం అదీ నీవే చూసుకోవాలి. నేను మాత్రం ఈ జాంగ్‌లాను ఒక్కక్షణం కూడా నమ్మను.' అన్నాడు విక్రమకేసరి. 'నేనూ ఇంతే,' అని శిఖిముఖి, జాంగ్‌లా కేసి తిరిగి, 'జాంగ్‌లా, నిజం చెప్పు. నీకు డబ్బు మీద ఎక్కువ ఆశా, ప్రాణం మీద ఎక్కువ ఆశా?' అని ప్రశ్నించాడు.

జాంగ్‌లా ఓ క్షణకాలం తటపటాయించి, తరువాత చిన్నగొంతుతో, 'శిఖి దొరా! నాకు రెంటిమీదా సమానమైన ఆశే ఉన్నది. ఒకటి లేకపోతే రెండోది వృథా!' అని ప్రశ్నించాడు.

'ఎంత విశ్వాస ఘాతకుడివైనా, ఇప్పుడు అజాగ్రత్త వల్లనో, పరధ్యాసం చేతనో నిజం చెప్పినట్లు కనబడుతున్నావు. ఈ క్షణం నుంచీ నీ ప్రాణం నా గుప్పిట్లో ఉన్నది. ఎలాంటి మోసం చేయకుండా గోల్‌భరాకు మమ్మల్ని చేర్చిన మరునిమిషంలో నీకు స్వేచ్ఛ ఇస్తాను. కొంత ధనం కూడా ఇస్తాను. విన్నావా?' అన్నాడు శిఖిముఖి.

'విన్నాను దొరా! కామాఖ్యనగరంలో శిథిలాలయ పూజారి అంతులేని ధనం ఆశ చూపి, నన్ను వక్రమార్గం పట్టించాడు. ఇకనుంచి మీకు విశ్వాస పాత్రుడిగా బతుకుతాను,' అన్నాడు జాంగ్‌లా.

శిఖిముఖి తలఊపి, జాంగ్‌లాను ముందు నడవమని, విక్రమకేసరితో రాత్రి తాము బస చేసిన చెట్టు దగ్గిరకు బయలుదేరాడు. వాళ్ళు ఆ చెట్టు దగ్గిరకు వచ్చేసరికి అజితుడూ, వీరభద్రుడూ

ఎర్రగండుతో వినోదంగా ఆడుకుంటు న్నారు. శిఖిముఖిని చూస్తూనే కుక్క అతడి దగ్గిరకు పరుగెత్తుకు వచ్చింది.

శిఖిముఖి, ఎర్రగండు తల నిము రుతూ, 'మత్తుమందు దెబ్బ నుంచి ఇప్పటికి కోలుకున్నావన్నమాట! ఇదుగో, ఆ మందు ప్రయోగించినవాణ్ణి ఓ కంట కనిపెట్టి ఉండు. పారిపోవాలని చూస్తే, మమ్మల్ని హెచ్చరించనవసరం లేదు. కంఠం కొరికి నెత్తురు తాగు,' అన్నాడు జాంగ్‌లాను చూపుతూ.

ఎర్రగండు జాంగ్‌లాను చూస్తూ చిన్నగా మొరిగింది. జాంగ్‌లా వెలవెల పోతూ, 'నేనికనుంచి తమకు విశ్వాస పాత్రుడైన సేవకుణ్ణి దొరా!' అన్నాడు. 'ఆ సంగతి ముందుముందు నువ్వు రుజువు చేసుకోవలసి ఉన్నది. ప్రస్తుతా నికి తాడుతో నీ చేతులు వెనక్కు విరిచి కట్టి పారిపోకుండా ఉండేందుకు కంచ రగాడిద మెడకు, ఆ తాడు బిగించబో తున్నాను,' అన్నాడు శిఖిముఖి.

ఆ తరవాత అందరూ కలిసి తమ సామానులను రెండు కంచరగాడిదల మీదా వేసి తాళ్లతో గట్టిగా కట్టారు. అజితుడు, జాంగ్‌లా చేతుల్ని వెనక్కు లాగి తాడుతో బలంగా ముడివేసి, రెండవ కొసను కంచర గాడిద మెడకు కట్టాడు. శిఖిముఖి ఆజ్ఞాపించగానే జాంగ్‌లా ముందుండి దారితీయసా



గాడు. మిట్టమధ్యాహ్నం వరకు వాళ్లు అరణ్యంలో నడిచి, ఒకలోయలో ప్రవహి స్తున్న ఒక నది పాయను చేరారు. అది హిమాలయాల్లో పుట్టిన పెద్ద నదికి ఉప నది అయి ఉంటుంది. నదిలో అక్కడ క్కడా ఎత్తయిన రాళ్లగుట్టలు ఉన్నవి.

శిఖిముఖి ఆ మొసళ్ల కేసి వింతగా చూస్తూ, 'కేసరీ, మనం బహుశా ఈ నది దాటవలసి ఉంటుందనుకుంటాను. నీటివేగం హెచ్చుగా ఉన్నా, నది వెడల్పు నూరుగజాల కన్న ఎక్కువ ఉండదు. కాని, ఈ మొసళ్లకు చిక్కకుండా దీన్ని దాటటం పెద్ద చిక్కు సమస్యే,' అన్నాడు.

'జాంగ్‌లా కావాలని మననిక్కడికి నడిపించాడేమో అని నా అనుమానం.

గోల్‌భరా గ్రామం చేరేందుకు ఈ నదిని దాటవలసిన అవసరం ఉన్నదో లేదో వాణ్ణి అడిగి చూస్తాను,' అన్నాడు కేసరి.

అందరికన్న ముందు నడుస్తున్న జాంగ్‌లాను సమీపించి విక్రమకేసరి, 'జాంగ్‌లా! ఈ మొసళ్ల నదికి దారితీశావేం! గోల్‌భరా ఇంకెంత దూరం?' అని అడిగాడు.

జాంగ్‌లా రొప్పుతూ, 'ఈ నదీతీరం వెంట నాలుగైదు కోసుల దూరం పోయి, ఒక కొండచరియ దాటి వెనక్కు తిరిగి ఒక కోసు దూరం వస్తే, గోల్‌భరా గ్రామం చేరవచ్చు. అలా కాక ఇక్కడ నది దాటి వెళితే, ఆ గ్రామం సుమారు రెండు కోసుల దూరంలో ఉంటుంది,' అన్నాడు.

'నీ కోసులలెక్క ఏదో కాస్త తికమకగా ఉన్నది. నదిలో ఇన్ని మొసళ్లు ఉండగా ప్రాణాపాయం లేకుండా దీన్ని దాటటం ఎలా?' అన్నాడు విక్రమకేసరి.

'చెట్లకొమ్మలు గాని, బోదెలు గాని నరికి తెప్పలు కట్టి వాటిమీద నది దాటవచ్చు, దొరా,' అన్నాడు జాంగ్‌లా.

అంతలో అక్కడికి శిఖిముఖి వచ్చాడు. విక్రమకేసరి జాంగ్‌లా చెప్పినదంతా అతడికి చెప్పి, నీ అభిప్రాయం ఏమిటని అడిగాడు. 'ఇది కొంచెం తాపీగా ఆలోచించవలసిన సంగతి. మనను ఈ జాంగ్‌లా గోల్‌భరా గ్రామం చేరుస్తున్నాడో లేక శిథిలాలయ పూజారి మాటు



పెట్టుకు కూచున్న చోటుకు చేర్చబోతున్నాడో ముందుగా తెలుసుకోవాలి. ముందు ఇక్కడ వంటపనులు కానిచ్చి, భోజనాలు ముగించుకుని తరవాత ఏం చేయవలిసిందీ ఆలోచిద్దాం,' అన్నాడు శిఖిముఖి.

ఆ వెంటనే కంచరగాడిదల మీంచి సామానులు దించి అజితుడూ, వీరభద్రుడూ వంటపని ప్రారంభించారు. శిఖిముఖి, జాంగ్‌లా చేతికట్లు విప్పి, పారిపోవాలని ప్రయత్నిస్తే చావు తప్పదని హెచ్చరించాడు. ఈ లోపల విక్రమకేసరి ఒక ఎత్తయిన చెట్టు ఎక్కి, అక్కణ్ణుంచి పరిసరాలు పరిశీలించాడు. అతడికి నది అవతల సుమారు రెండుమూడు కోసుల



దూరంలో, ఒక కొండవాలు దగ్గర్నుంచి పొగ వస్తుండటం కనిపించింది.

విక్రమకేసరి చెట్టుదిగి వచ్చి శిఖిముఖికి ఈ సంగతి చెప్పి, 'అది గోల్‌భరాయే కావచ్చు,' అన్నాడు. 'అయే ఉంటుంది. భోజనాలైన తరవాత జాంగ్‌లాను చెట్టెక్కించి ఆ పొగ ఎక్కణ్ణించి వస్తున్నదో చూసి చెప్పమందాం. శిథిలాలయ పూజారి కూడా మన దారి తెన్నులు చూస్తూ, ఈ ప్రాంతాల్లో ఎక్కడో ఉన్నట్లు తెలుస్తున్నది గదా. మనం తగు జాగ్రత్తలో ఉండాలి,' అన్నాడు శిఖిముఖి.

తరవాత అందరూ చెట్లనీడన కూర్చుని భోజనాలు చేశారు. నదిలో నుంచి నీరు తేవటానికి పోయిన అజితుడూ, వీరభద్రుడూ ఎంతో శ్రమపడి మొసళ్లను బెదరగొట్టి పాత్రల్లో నీళ్లు నింపుకోవలసి వచ్చింది.

'కేసరి దొరా! ఈ నదిని మనం దాటాలని చూడటం ప్రమాదకరం. నది వెంట ఎగువకు పోయి, ఈ జాంగ్‌లా చెప్పిన కొండచరియ ఏదో దాటి, గోల్‌భరా చేరటం బావుంటుంది,' అన్నాడు అజితుడు. 'అదే ఆలోచిస్తున్నాం. అసలు ఈ మోసకారి మాటల్లో ఉన్న నిజమెంతో ముందు తెలుసుకోవాలి గదా,' అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి, జాంగ్‌లాను దగ్గిరకు పిలిచి దాపులనున్న మహావృక్షం ఒకటి ఎక్కి చుట్టుపక్కల పూజారి ముఠా గాని, ఏదైనా గ్రామం గాని ఉన్నదేమో చూడమన్నాడు. జాంగ్‌లా ఎలుగుబంటిలా చకచకా చెట్టుమీదికి పాకిపోయి, చుట్టూ ఓమారు కలయచూసి, చిన్నగా నవ్వుకుని చెట్టు దిగివచ్చాడు. ఆ దృశ్యం శిఖిముఖీ వాళ్లు గమనించలేదు.

జాంగ్‌లా, శిఖిముఖి దగ్గిరకు వచ్చి, 'దొరా! దూరాన కొండల్లో గోల్‌భరా గ్రామం కొంచెంగా కనబడుతున్నది. గ్రామం చుట్టూ అరణ్యం కావటంతో కొత్త వాళ్లు దాన్ని గుర్తించడం కష్టం. ప్రయాణమవుదామా?' అని అడిగాడు.

'ప్రయాణం ఇప్పుడు కాదు, ఎండ తగ్గి చల్లబడింతర్వాత. నీ మిత్రులు ఆ

పూజారి ముఠా నది అవతల ఎక్కడైనా కనిపించిందా?' అని అడిగాడు శిఖి ముఖి. ఆ ప్రశ్న వింటూనే జాంగ్‌లా కొంచెంగా వణికి, 'నన్నింకా నమ్మటం లేదా దొరా! ఆ దుర్మార్గులు నా కంటబడితే ప్రాణాలతో వదలను,' అన్నాడు.

జాంగ్‌లా చేతులు రెండూ ఎత్తి శిఖి ముఖికి నమస్కరిస్తూ, ఏమో చెప్పబోయేంతలో మేతకు వదిలిన కంచర గాడిదల్లో ఒకటి, నది ఒడ్డునే ఉన్న ఒక చెట్లపొద దగ్గిరినుంచి పెద్దగా అరుస్తూ, దూరంగా పారిపోసాగింది.

శిఖిముఖి, అజిత వీరభద్రుల్ని దాన్ని మళ్ళ వేసుకురమ్మని చెప్పబోయేంతలో, జాంగ్‌లా కర్ర ఒకటి తీసు కుని గాడిద కేసి పరిగెత్తాడు.

విక్రమకేసరి చప్పున విల్లంబులు చేతబట్టి, జాంగ్‌లా కేసి గురిచేశాడు. ఒకవేళ వాడు అరణ్యవృక్షాల్లోకి పారిపోవాలని చూస్తే, బాణంతో కొట్టటానికి అతడు సిద్ధంగా ఉన్నాడు. ఈలోపల అజిత వీరభద్రులు కూడా అటుకేసి బయలుదేరారు.

జాంగ్‌లా పరిగెత్తుతున్నవాడల్లా నది ఒడ్డునున్న చెట్లపొద దగ్గిరకు వెళ్ళూనే ఠక్కున ఆగిపోయాడు. పొదలోనుంచి ఒక చిరుతగండు కోపంతో అరిచింది. అది ఆ సమయంలో అక్కడ తాను చంపిన లేడి నొకదాన్ని తింటున్నది. ముందు కంచరగాడిదా, తరవాత జాంగ్‌లా అక్కడికి పోయి దాన్ని రెచ్చగొట్టారు. చిరుతపులి పొదలో నుంచి



తల బయటకు నెట్టింది. పొదకు ఒక గజం దూరంలో జాంగ్‌లా భయకంపి తుడై, వెనక్కు అడుగు వేసేందుకు్కూడా శక్తిచాలక నిలబడిపోయాడు.

ఒక తృటికాలం ఇలా చిరుతపులీ, వాడూ ఒకరి ముఖాలొకరు చూసు కుంటూ స్థాణువుల్లా కదలా మెదలక ఉండి పోయారు. అంతలో చిరుత కసిగా అరిచి, జాంగ్‌లా కేసి లంఘిం చింది. జాంగ్‌లా చావు ఎలానూ తప్పద నుకుని కర్రతో బలంగా చిరుతపులి తల మీద కొట్టాడు. కాని, చిరుత బలం ముందూ, వేగం ముందూ అతడి శక్తి కొరగానిదై పోయింది. చిరుతపులి, తన గొంతు పట్టుకోకుండా జాంగ్ లా దాని మెడ మీద బలంగా ముష్టిఘాతాలివ్వ సాగాడు. అది కాళ్లతో వాడి నడుం పట్టు కుని విదిలించింది. చిరుతా జాంగ్‌లా కూడా, ఒకళ్లనొకళ్లు బలంగా పట్టుకుని ఉండటంతో, ఆ ఊపుకు పల్లంగా ఉన్న నదిలోకి దొర్లుకుంటూ పోయి, ప్రవా హంలో పడ్డారు.

ప్రవాహంలో పడినా ఒకళ్లనొకళ్లు వద లకుండా సంఘర్షిస్తున్న చిరుతా, మనిషీ మీదికి పదీ పన్నెండు మొసళ్లు అన్ని వైపుల నుండీ వేగంగా వచ్చి పడినై. క్షణా లమీద జరిగిపోయిన ఈ ఘోరం చూసి శిఖిముఖి నిశ్చేష్టుడైపోయాడు. కాని, విక్రమకేసరి, మొసళ్ళకేసి బాణం తర వాత బాణం కొట్టసాగాడు.

పోరాడుతూ, ప్రవాహం వెంట కొట్టుకు పోతున్న చిరుతపులీ, జాంగ్‌లాల కేసి నది అవతలి ఒడ్డునున్న చెట్లలోనుంచి బాణాలు రివ్వురివ్వుమంటూ రాసాగినై. అక్కడెవరో దాగి ఉండి జాంగ్‌లాకు తగలకుండా, గురిగా చిరుతపులి మీదికి బాణాలు వదులుతున్నారు.

– (ఇంకా ఉంది)



# నిజమైన సన్యాసి

ఒకానొక దేశపు రాజుగారికి పెద్ద జబ్బు చేసింది. తను జబ్బు నుంచి బతికి బయట పడితే, నగరంలోని సన్యాసులందరికీ, ఒక్కొక్కరికి ఒక బంగారు నాణెం చొప్పున ధర్మం చేస్తానని ఆయన మొక్కుకున్నాడు. తరవాత కొద్ది రోజులకే ఆయనకు వ్యాధి నిమ్మళించి, ఆరోగ్యం చిక్కింది. ఆయన తన సేవకుల్లో నమ్మకస్థుడైన వాణ్ణొకణ్ణి పిలిచి, వాడికి అయిదువేల బంగారు నాణాలున్న సంచిని ఇచ్చి, ''ఒరే, నువ్వు నగరంలోకి పోయి, కనబడ్డ ప్రతిసన్యాసికి ఒక్కోనాణెం చొప్పున ధర్మం ఇచ్చిరా,'' అన్నాడు.

నౌకరు నగరంలో సాయంకాలం దాకా తిరిగి, రాజుగారి వద్దకు వచ్చి, బంగారు నాణాలున్న సంచిని ఆయనముందు పెడుతూ, ''మహారాజా! నగరం అంతా గాలించాను. ఒక్కగొనొక్క సన్యాసి అయినా కంటబడలేదు!'' అన్నాడు.

నౌకరు అన్న మాటలు వింటూనే రాజుగారికి ఎక్కడలేని కోపం వచ్చింది. ఆయన గద్దిస్తూ, ''ఏమిరా నీ పొగరు! ఇంత మహానగరంలో నీకు సన్యాసే కనిపించలేదా? నగరంలో నాలుగైదువేలమంది సన్యాసులున్నట్లు నేను విన్నాను.'' అన్నాడు.

అందుకు నౌకరు వినయంగా, ''క్షమించండి, మహారాజా! సన్యాసి అయిన వాడు డబ్బు పుచ్చుకోడు, డబ్బు పుచ్చుకునేవాడు సన్యాసి కాడు,' అన్నాడు.





# ఎవరిది పాపం?

అనగా అనగా కౌశికుడు అనే ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన చాలా ఉత్తముడూ, దైవభక్తిపరాయణుడూ.

ఒకరోజున కౌశికుడు ఒక పండితుణ్ణి విందుకు పిలిచాడు. పండితుడు సమ్మతించాడు. కౌశికుడు తమకు వాడుకగా పాలూ పెరుగూ తెచ్చే పాలమనిషిని పిలిచి, 'అమ్మీ, రేపు గట్టిగా తోడుపెట్టిన పెరుగు తెచ్చావంటే, మామూలుకంటే, ఎక్కువ డబ్బిలిస్తాను,' అని చెప్పాడు.

పాలమనిషి కల్తీలేని గట్టిపెరుగు తోడుపెట్టి, ఆ ముంత భద్రంగా గంపలో పెట్టుకుని మరునాడు ఉదయం బ్రాహ్మడి ఇంటికి బయలుదేరింది. ఆమె గబగబ నడుస్తూ ఉండగా, గాలి విసురుకు పెరుగుముంత మీది గుడ్డకాస్తా తొలగిపోయింది. ఇదే సమయంలో ఒక గరుడపక్షి త్రాచు పాము నొకదానిని కాళ్లతో పట్టుకుని ఆకాశ మార్గాన ఎగిరిపోతూ ఉంది. బాధతో గిలగిలకొట్టుకుంటూన్న ఆ త్రాచుపాము విషం కకింది. ఆ విషం సరాసరి పాల మనిషి నెత్తిన ఉన్న పెరుగుముంతలో వచ్చిపడింది.

పాలమనిషి తిన్నగా కౌశికుని ఇంటికి వెళ్లి, పెరుగుముంత ఇచ్చేసి, చక్కాపోయింది. కౌశికుడు ముంత పట్టుకుపోయి భద్రపరచుకున్నాడు.

విందు సమయమయింది. వేళకు పండితుడు వచ్చాడు. పదార్థాలన్నీ చాలా రుచిగా ఉండటం చేత, సుష్టుగా భోజనం

రవికిరణ్

చేశాడు. చివరకు ప్రత్యేకించి తోడు పెట్టించిన ఆ ముంతలో ఉండే గట్టి పెరుగు తెచ్చి బ్రాహ్మణుడు ఆనందంతో వడ్డించాడు. పండితుడు ఆప్యాయంగా ఆరగించాడు.

ఐతే. భోజనమైన కొంచెం సేవటిలోనే పండితుడు గిలగిల తన్నుకుని ప్రాణాలు విడిచాడు. జరిగిన సంగతి ఏమిటో ఎవరికి మాత్రం ఏం తెలుసు? ఏదో ఆకస్మికంగా వ్యాధి వచ్చి ఇలా జరిగిందనుకుని, కౌశికుడు ఎంతగానో విచారించాడు.

భూలోకంలో ఇలా పండితుడు మరణించగానే నరకలోకంలో లెక్కలు వ్రాసే చిత్రగుప్తుడికి చిక్కు వచ్చింది. పండితుడిని చంపిన పాపం ఎవరికి చెందుతుంది. అనే సమస్యతో అతను తికమకలు పడసాగాడు.

పండితుడికి భోజనం పెట్టినవాడు బ్రాహ్మణుడు కనుక ఈ పాపం అతనిదే అనుకున్నాడు. కాని వెంటనే ఈ అభిప్రాయం మారిపోయింది. మంచి గట్టి పెరుగు తెప్పించి, పండితుడికి తృప్తిగా విందు చేస్తున్నాం కదా అని ఉత్సాహంతో వడ్డించాడు.

కాని, పెరుగు ముంతలో పాము విషం కక్కిన సంగతి అతనికేం తెలుసు? తెలిసి వుంటే వడ్డించడు కదా? బ్రాహ్మణుడు కేవలం నిర్దోషి, పాపం అతనికి అంటదు, అని తర్కించుకున్నాడు.




పోనీ, పెరుగు తెచ్చిన పాలమనిషిది తప్పా! ఊహు, గంపమీద గుడ్డ ఎగిరిపోవడం కాని, ముంతలో పాము విషం పడటం కాని ఏదీ తెలియదు ఆమెకు. అందుచేత పాలమనిషికి ఈ పాపము చెందదు అని నిశ్చయించుకున్నాడు.

ఐతే. ముంతమీదినుంచి గుడ్డ తొలగకుంటే, పాము కక్కిన విషం పెరుగులో కలియటం, పండితుడు చనిపోవడం జరగదు కదా! కనుక, గుడ్డను తొలగించిన వాయుదేవునిదా ఈతప్పు, అని మళ్లీ ప్రశ్న వచ్చింది. కాదు, గాలి వీచకుంటే ప్రాణికోటి బ్రతికేది ఎట్లా? వాయుదేవుడికి వీచటం సహజగుణం. వాయుదేవుడి



ను పట్టుకుంది కాని, తక్కిన గొడవంతా దానికేం తెలుసు. పైగా ముంతలోనే విషం కక్కమని అదేం పామును నిర్బంధించ లేదే? అందుచేత గరుడపక్షి పూర్తిగా నిర పరాధి. ఏ విధంగా చూసినా, ఇందులో ఎవరినీ తప్పుపట్టడానికి వీలులేకుండా ఉంది. ఈ విషయం ఏమీ తేల్చుకోలేక చిత్రగుప్తుడు యమ ధర్మరాజు వద్దకు పోయి, సలహా చెప్పమని కోరాడు. యమ ధర్మరాజుకూ ఏమీ తోచక, అక్కడ ఉన్న ధర్మశాస్త్రవేత్తలను అడిగేడు. వారూ ధర్మం నిర్ణయించలేకపోయారు.

యముడు తిన్నగా విష్ణువు దగ్గరకు పోయి విన్నవించాడు. విష్ణువుకీ పాలుపో యింది కాదు. సభ చేశాడు. ఎవరూ ధర్మ నిర్ధారణ చేయలేకపోయారు. అప్పుడు యముడు 'చిత్రగుప్తుడితో ఇది తేలే విషయం కాదు. నేను మళ్లీ చెప్పేవరకూ ఈ పాపం ఎవరికీ చెందినట్లు లెక్క రాయ వద్దు,' అన్నాడు.

తప్పు ఇందులో కొంచెమైనా లేదు. అని చిత్రగుప్తుడు తీర్మానించుకున్నాడు.

పోతే, విషం కక్కిన పాముకి చెందు తుందా ఈ పాపం? అదీ సమంజసంగా కనబడలేదు. గరుడపక్షి తనను గోళ్లతో నొక్కిపట్టుతూ ఉంటే బాధ భరించలేక, ప్రాణంపోయే సమయంలో అది విషం కక్కింది. ఆ విషం ఎక్కడ పడుతుందో దానికేం తెలుసు? విషం పోయి సరిగా పెరుగు ముంతలోనే పడుతుందని పాము కలగన్నదా? కాబట్టి పాముని తప్పు పట్ట డానికి వీలు కనిపించలేదు.

ఇక మిగిలిందల్లా గరుడపక్షే. దాని ఆహారంకోసం అది తాపత్రయపడి పాము

ఇలా అని యముడు తన భటులను భూలోకానికి పంపించాడు. ఒకనాడు ఇద్దరు బ్రాహ్మణులు ఒకే చెట్టుకింద విశ్రాంతి తీసుకుంటున్నారు. అందులో ఒకనికి పక్షి భాష వచ్చును. ఆ చెట్టుమీద ఉన్న పక్షి దంపతులు ఆ రోజున తాము గరుడిని వల్ల విన్న వృత్తాంతాలు- కౌశి

కుడు పండితుడికి విందు చేయడం, పండితుడు చనిపోవడం, దీనిగురించి యముడు తిప్పలు పడటం చెప్పుకుంటున్నాయి. ఇదంతా వింటున్న ఆ బ్రాహ్మణుడు సంగతి అంతా రెండవ వానికి చెప్పి 'దీనికే ఇంత బ్రహ్మాండమా? నన్నడిగితే తీర్పు చెప్పేవాడిని. వస్తుపరీక్షచేయకుండా అతిథికి వడ్డించడం చేతనే పండితుడు పోయాడు. ఈ పాపం కౌశికుడిదే' అన్నాడు.

ఆసమయంలో భూలోకానికి దిగి వస్తున్న యమకింకరులు ఈ మాటలు విని, ఆ బ్రాహ్మణుడిని యమధర్మరాజు ఎదుటకు లాక్కుపోయారు. 'ఈ మాటలు నీవు అన్నావా లేదా?' అని యముడు బ్రాహ్మణుడిని అడిగాడు. 'అన్నాను' అని నిర్భయంగా చెప్పాడు బ్రాహ్మణుడు.

అప్పుడు యమధర్మరాజు రెండు కుండల పెరుగు తెప్పించాడు. ఇందులో ఒకదానిలో రహస్యంగా విషం కలిపించి, బ్రాహ్మణుడి ముందు పెట్టించాడు. 'బ్రాహ్మడా, ఈ రెండు కుండలలోనూ దేనిలో విషం కలిసి ఉందో చెప్పు,' అన్నాడు.

బ్రాహ్మణుడు తెల్లబోయాడు. ఆ రెండు కుండల్లో ఏది విషం కలిసినదో, ఏది కలియనిదో తెలుసుకోవాలంటే తను ముందుగా రుచి చూచి పరీక్షించాలి. ఒక వేళ అది విషం కలిసిన పెరుగుకుండ అయితే తను మరణిస్తాడు.

అప్పుడు యముడు కోపించి, 'బ్రాహ్మడా నీకు విషయం తెలియనప్పుడు తెలియనట్టు ఉండక, పరులమీద నిందలాడావు. అందుచేత, పండితుడిని చంపిన పాపం నీకే చెందుతుంది,' అని చెప్పి, అతని పేరు చిత్రగుప్తుడి లెక్కలలో వ్రాయించాడు.

ఎవరికీ చెందని పాపం నిష్కారణంగా ఆ బ్రాహ్మణుడికి అంటుకున్నది.





# దొంగసొత్తు

సోమేశ్వరాన్ని మాణిక్యవర్మ పరిపాలిస్తున్న రోజులవి. మంత్రి అఖండనాథుడి సలహా సంప్రదింపులతో పాలన నల్లేరుపై బండి నడకలా సాగుతోంది.

ఒకనాడు రాత్రి, కాపలా కాస్తున్న సైనికుల చేతికి గజదొంగ కామరాజు అనుకోకుండా చిక్కాడు.

కామరాజు చాలాకాలం నుంచి సోమేశ్వర రాజ్యంలోని ప్రజల కంటిపై కునుకు లేకుండా చేస్తున్నాడు. ధనవంతులైతే రాత్రిళ్లు మేల్కొని పగలు నిద్రపోవడం ప్రారంభించారు.

కామరాజుని దండించి స్థావరం వివరాలు తెలుసుకుని, అక్కడి సంపదనంతా స్వాధీనం చేసుకున్నాడు సైనికాధికారి. మరుసటి రోజు సభలో కామరాజు ప్రవేశ పెట్టబడ్డాడు. స్వాధీనం చేసుకున్న సొత్తులో అధిక భాగం నగరంలోని ప్రముఖ ధనవంతుడు నీలకంఠుడిదే! అయితే నీల కంఠుడు ఏ రోజు కూడా సొత్తు పోయిందని ఫిర్యాదు చేసినవాడు కాదు.

'మంత్రివర్యా.. నీలకంఠుడు అభిమానవంతుడు కావడం చేత పోయిన తన సంపద గురించి మనకు తెలియ పరిచి ఉండడు. తక్షణమే అతడిని పిలిపించి అప్పగించండి.' మాణిక్యవర్మ ఆజ్ఞ చేశాడు.

'ప్రభూ... నీలకంఠుడి సొమ్ము పోగా మిగిలినది ఎవరెవరిదో నిర్ణయించుకు

శాఖమూరి శ్రీనివాస్

నేందుకు కొంత వ్యవధి అవసరం. రెండు రోజుల తర్వాత సొమ్మంతటినీ హక్కుదారులకు అందిద్దాం. నీలకంఠు డిని కూడా అప్పుడే రప్పిద్దాం,' అని చెప్పిన అఖండనాథుని మాటలకు రాజు సమ్మతించాడు.

రెండు రోజుల తర్వాత సొమ్ము హక్కు దారులంతా సభకు రప్పించబడ్డారు. ఒక్కొక్కరే వచ్చి పోయిన తమ సొమ్ము వివరాలు, ఆధారాలు చెప్పి తీసుకు వెళ్ళసాగారు.

నీలకంఠుడి వంతు వచ్చింది. అయితే చాచేందుకు వీలు లేకుండా అతని చేతు లకు సంకెళ్ళు వేయబడి ఉన్నాయి.

ఆ దృశ్యం చూసి ఆశ్చర్యపోతున్న మాణిక్యవర్మకు సందేహనివృత్తి చేస్తూ, ''మహారాజా.. నీలకంఠుడు కామరాజు కంటే పెద్ద గజదొంగ. పలు అక్రమవ్యా పారాలతో, పన్నులు ఎగవేసి కోట్లాది వరహాలు పోగేశాడు. 'దొంగసొత్తుకు లెక్క ఉండదు' అనే సామెతను నిజం చేస్తూ, పోయిన ధనంపై మనకు ఎలాంటి ఫిర్యాదు చేయలేదు.

నీలకంఠుడి బలహీనతను గమనిం చిన కామరాజు పలుమార్లు అతని ధనాన్నే దొంగిలించాడు. నీలకంఠుడి నిష్క్రియ నాకు అనుమానం తెప్పిం చింది. దీని కారణంగానే మిమ్మల్ని రెండ్రోజుల గడువు కోరి, ఈ సమయంలో వివరాలన్నీ తెలుసుకున్నాను.'' వివ ్రమంగా చెప్పాడు అఖండనాథుడు.

విషయం తెలుసుకున్న మాణిక్య వర్మ అఖండ నాథుడిని అభినందించి నీలకంఠుడికి కఠిన కారాగారశిక్ష, కామ రాజుకు సాధారణ కారాగారశిక్ష విధిం చాడు.



# ఇంకా నయం!

ఒకనాడు ఒక రైతు తమ జమీందారుగారిని చూడబోతూ, తన భార్యతో, ''ఏమే, జమీందారు గారికి వెలగకాయలు ఇస్తాను, ఒక బుట్టెడు కట్టి ఇయ్యి!'' అన్నాడు.

''ఆయనకు వెలగకాయలెందుకు? అత్తిపళ్లు బాగా కాశాయి. తీసుకు పోయి ఇస్తే తింటాడు,'' అని రైతుభార్య ఒక బుట్టనిండా అత్తిపళ్లు పెట్టి భర్తకు ఇచ్చింది.

రైతు జమీందారుగారి దర్శనం చేసుకోవడానికి వెళ్లేసరికి జమీందారుగారు వరండాలో కుర్చీ వేసుకుని కూర్చుని ఉన్నారు. . అత్తిపళ్ల బుట్టను జమీందారుగారి పక్కనే పెట్టి రైతు చేతులు కట్టుకుని ఎదురుగా నిలబడ్డాడు.

జమీందారు బుట్ట పైమూత తీసి, అత్తిపళ్లు చూసి, ఒక పండు తీసి గురిగా రైతు తలమీద పడేటట్టు విసిరాడు. అత్తిపండు తలపైన పడగానే రైతు, ''ఇంకా నయం!'' అనటం జమీందారుగారికి ఆశ్చర్యం కలిగించింది.

''నేను నిన్ను అత్తిపళ్లతో కూడుతూంటే నువ్వు, ఇంకా నయం అంటావెందుకు?'' అని జమీందారు రైతును అడిగాడు.

''నేనసలు తమకు వెలగకాయలు తెచ్చిపెడదామనుకున్నాను. పుణ్యాత్మురాలు నా భార్య వెలగకాయలు వద్దని అత్తిపళ్లు కట్టి ఇచ్చింది. అదృష్టవంతుణ్ణి కదా!'' అన్నాడు రైతు.



# కెరీర్ అంటే?




మిత్రులారా,

గతనెలలో మనం కెరీర్‌లో న్యాయవాది గురించి తెలుసుకున్నాము. ఈ నెలలో కంపెనీ సెక్రటరీ గురించిన సమాచారం తీసుకువస్తానని చెప్పాను. కెరీర్‌లో భాగంగా ఈ సమాచారం సేకరిస్తున్నప్పుడు, ప్రపంచీకరణ కారణంగా కార్పొరేట్ రంగంలో పెరుగుదల, విస్తరణ వంటివి అన్ని రంగాల్లోనూ నిపుణులకోసం డిమాండ్ చేస్తున్నాయని నాకు బోధపడింది.

కంపెనీ సెక్రటరీ కూడా అలాంటి ప్రత్యేకీకరించబడిన ప్రొఫెషనల్ అని మా కెరీర్ సలహాదారు చెప్పారు. కంపెనీ సెక్రటరీ కార్పొరేట్ రంగంలో నైపుణ్యవంతమైన నిర్వహణకు బాధ్యత పడుతుంటారు, లీగల్ వ్యవహారాలలో సలహాదారుగా కూడా పనిచేస్తుంటారు. అతడు/ఆమె సంస్థలోని పలు విభాగాలను సమన్వయపరుస్తూంటారు. పలు కంపెనీ చట్టాలను అన్వయిస్తూంటారు. చట్టపరమైన కంపెనీ అవసరాలపై కంపెనీ డైరెక్టర్లకు సూచనలు అందిస్తుంటారు. దీనికి తోడు, ఫైనాన్స్, ఎక్కౌంట్స్, లీగల్, పర్సనల్, కార్యనిర్వాహక వ్యవహారాలకు సంబంధించిన ఇతర విధులను కూడా వీరు నెరవేరుస్తుంటారు.

కంపెనీ సెక్రటరీ అనేది ఒక ప్రొఫెషనల్ కోర్స్. భారతదేశంలో కంపెనీ సెక్రటరీల వృత్తిని అభివృద్ధి చేసి, క్రమబద్ధీకరించడానికి 1980 కంపెనీ సెక్రటరీస్ యాక్ట్ కింద పనిచేసే ఇనిస్టిట్యూట్ ఆఫ్ కంపెనీ సెక్రటరీస్ ఆఫ్ ఇండియా (ఐసిఎస్ఐ)చే ఈ కోర్సు నిర్వహించబడుతోంది.

కంపెనీ సెక్రటరీలు ప్రభుత్వ ఎక్కౌంట్ విభాగాలు, న్యాయ విభాగాలలో ఉపాధి అవకాశాలను పొందగలరు. చాలామంది అర్హత కలిగిన కంపెనీ సెక్రటరీలు ప్రభుత్వరంగం, కార్పొరేట్ రంగం, బ్యాంకులు, ద్రవ్యసంస్థలు, స్టాక్ ఎక్ఛేంజ్‌లు, కంపెనీ న్యాయ మండలులు మరియు ప్రభుత్వ విభాగాలలో మంచి వేతనాలు పొందగలరు. లైసెన్సులు, రిజిస్ట్రేషన్లు, రుణాలు, పన్నులు, భాగస్వామ్య ఒప్పందాలు వంటి వృత్తిపరమైన సలహా, సహకారాల ప్రాతిపదికన చిన్న సంస్థలు కంపెనీ సెక్రటరీలను నియమించుకుంటాయి.

వాణిజ్య సంస్థలు లేదా సిఎస్ సంస్థలలో అత్యున్నత స్థాయిలో సాధారణ నిర్వహణ మరియు పాలన వంటి రంగాలలో ప్రవేశించడానికి, మరింత నైపుణ్యం సాధించడానికి కూడా కంపెనీ సెక్రటరీలకు చాలా అవకాశాలున్నాయి. - సాయి

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 36

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువమంది ఉన్నట్లయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ -36 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. ఫిబ్రవరి నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. ఏప్రిల్ 2012 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## ప్రాంతాలను గుర్తించండి



1. 'ఆసియన్ స్విట్జర్లాండ్' అని పిలువబడే రాష్ట్రం పేరు ఏమిటి?
2. 'దక్షిణ భారత దేశ మాంచెస్టర్' అని ఏ నగరానికి పేరువచ్చింది?
3. 'వర్ష మేఘాల భూమి' అని ఏ ప్రాంతాన్ని పిలుస్తున్నారు?
4. భారతదేశంలో 'నీలి పర్వతాలు' అని వేటిని పిలుస్తున్నారు?
5. 'ఏడు దీవుల నగరం' అని ఏ నగరానికి పేరు?
6. 'అరేబియా రాణి' అని ఏ నగరానికి పేరు?
7. 'గులాబి నగరం' అని దేనికి పేరు?

### చందమామ లోకజ్ఞానం క్విజ్-33 సమాధానాలు:

**1.** మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ; **2.** పోర్‌బందర్; **3.** హరిశ్చంద్ర; **4.** న్యాయశాస్త్రం; **5. 1942; 6. 1939; 7.** పోరాడు లేదా చావు; **8. 1948** జనవరి **30**న నాథూరామ్ గాడ్సే చంపాడు.

*October'11 Winners: 1. Dhananjaya Meher, Purunabastee, Jharsuguda - 768202.*
*2. Ramkinkar Das, Tiorkhali (Post&Vill.), East Midnapore (Dist.), Paschimbanga - 721655.*
*3. P.R Anivitha Shastry, Pandaru Farms, Main (Post), Bantwal (Taluk), Karnataka - 574253.*
*4. R.P Subhamathi, Kallakurichi (Post), Belukurichi JK, Namakkal (Dist.) - 637402.*
*5. S. Harikrishnan, Poovakulam, Koothattukulam, Ernakulam (Dist.) Kerala.*



# నవ్వుల పువ్వులు



ఆఫీస్ మేనేజర్: 'బల్లపై పేరుకుపోయిన దుమ్మును ఒకసారి చూడు. చూస్తుంటే పక్షం రోజులుగా బల్లను శుభ్రం చేసినట్లుగా కనిపించడం లేదు.'

పనిమనిషి: నన్ను తిట్టకండి సర్, నేను ఇక్కడికి వచ్చి వారం రోజులు మాత్రమే అయింది.

ఒక యువకుడు పెట్ షాపుకు వెళ్లి 200 బొద్దింకలు, 6 ఎలుకలు, 5 ఎలుకలు కావాలని అడిగాడు.



'క్షమించండి సర్,' అన్నాడు షాపు మేనేజర్. 'కాని మేము ఎలుకలు మాత్రమే ఇవ్వగలం. మీకు మిగతా జంతువులు ఎందుకు?'

'నన్ను ఈ ఉదయం ఇల్లు ఖాళీ చేయమని ఇంటి యజమాని చెప్పేశాడు. పైగా ఇల్లు ఎలా ఉండిందో అలాగే వదిలి వెళ్లవలసిందిగా కోరాడు మరి.'



న్యాయమూర్తి ముద్దాయిని తీక్షణంగా చూస్తూ అన్నాడు. 'ఎన్ని సార్లు జైలు కెళ్ళావు?'

'తొమ్మిదిసార్లు వెళ్లాను యువరానర్,' ముద్దాయి సమాధానమిచ్చాడు.

'తొమ్మిది సార్లా? ఈ కేసులో నీకు గరిష్టంగా శిక్ష విధిస్తాను.'

'గరిష్ట శిక్షా?' ఆశ్చర్యపోయాడు ముద్దాయి. 'క్రమం తప్పకుండా మీవద్దకు వచ్చేవారికి మీరు రాయితీ ఇవ్వరా?'

జాన్: ఈ శనివారం మీరు నేను నిర్వహిస్తున్న పార్టీకి వస్తారు కదండీ?

విమల్: అవును, తప్పకుండా వస్తాను. మీ చిరునామా ఎక్కడ?

జాన్: కొత్త వీధిలో నాలుగో నంబర్‌లో మా ఇల్లు ఉంది. మీ మోచేతితో గంట మోగించండి చాలు.

విమల్: నా వేలితో ఎందుకుమోగించకూడదు?

జాన్: మీరు పార్టీకి ఉత్తచేతులతో రావడం లేదు కదా మరి?



రాజ ఫలహారం

# చరిత్రలో బ్రెడ్...





చాలా కాలం క్రితం, ప్రజలు గోధుమలను అలాగే నమిలి మింగేసే వారు. కాని గోధుమలను దంచి ముద్దలాగా చేస్తే అది చాలా రుచిగా ఉంటుందని వారు గుర్తించినప్పుడు పరిస్థితి బాగా మారిపోయింది. అది అంతటితో ఆగిపోలేదు. ఆ ముద్దను నిప్పులమీద కాల్చినప్పుడు అది గట్టిగా మారి గట్టి బ్రెడ్ తయారైంది. ఇది చాలా రోజులు నిల్వ ఉండింది. పిండి ముద్దకు యాదృచ్ఛికంగా ఈస్ట్ వంటి నురుగు కలిపినప్పుడు బ్రెడ్ మెల్లగా ప్రజల ఆహారంలో భాగమైపోయింది!

ఈజిప్ట్‌లో క్రీ.పూ 1000 ప్రాంతంలో, ప్రజలు ఈస్ట్ నురుగును గమనించి గోధుమపిండిలో కలపడం ప్రారంభించారు. క్రమంగా తెల్ల బ్రెడ్‌ని తయారు చేయగలిగే కొత్త రకం గోధుమ రకాన్ని కనిపెట్టారు. ఈజిప్షియన్ గూఢలిపిని చూశారా? ఈ లిపిలో బ్రెడ్‌కి సంబంధించిన అనేక చిహ్నాలు, చిత్రాలు ఉన్నాయి.





అక్కడినుంచి మొదలై బ్రెడ్ గ్రీసు, రోమ్ మరియు యూరప్ లోని ఇతర ప్రాంతాలకు వ్యాపించింది. రోమ్‌లో అయితే బ్రెడ్ మాంసం కంటే ప్రీతిపాత్రమైపోయింది. ప్రజలకు గోధుమలు పంపిణీ చేయ డంమీదే రాజ్య శ్రేయస్సు ఆధారపడి ఉంటుందని భావించేవారు కూడా. తర్వాత ప్రభుత్వం గోధుమ రొట్టెలను కూడా పంపిణీ చేయడం మొదలెట్టింది. తమకు కేటాయించిన బ్రెడ్‌ని తమకు ఇవ్వకపోతే సైనికుల మనస్సు గాయపడేది!

క్రీ.పూ 168లో, రోమ్‌లో రొట్టెల తయారీదార్ల సంఘం ఏర్పడింది. ఈ సంఘం రొట్టెల తయారీదార్లను వారి పిల్లలను వారు వృత్తిని వదిలిపెట్టేందుకు లేదా ఇతర వృత్తులు చేపట్టేందుకు ఏమాత్రం అనుమతించేది కాదు. రొట్టె తయారీదార్లు ప్రత్యేక స్థితిని ఆస్వా దించేవారు. ఇతర హస్త కళా నిపుణులు బానిసలుగా గుర్తించబ డుతున్న సమయంలో వీరు ఒక్కరే స్వేచ్ఛా ప్రజల్లాగా ఉండే వారు. వీరు విదూషకులలో లేదా మల్లయోధులలో కలిసి పోవ డాన్ని సమాజం అనుమతించేది కాదు!





మధ్యయుగ యూరప్‌లో, బ్రెడ్ ముఖ్య ఆహారంగా ఉండేది. పైగా దీన్ని విందులలో ముఖ్యమైన ఆహారంగా కూడా వడ్డించేవారు! బ్రెడ్‌ని నలుచదరపు ముక్కలులాగా కోసి దాన్ని బల్లపై పళ్లెంలాగా కూడా ఉపయోగించేవారు. భోజనానంతరం, ఈ బ్రెడ్ పళ్లేన్ని కూడా తినేసేవారు లేదా కుక్కలకు పెట్టేవారు.



స్విట్జర్లాండ్‌లో బ్రెడ్‌ని క్రైస్తవ చర్చి మందిరాల్లో భారీ స్థాయిలో తయారుచేసేవారట. సెయింట్ గాలెన్‌లో ఉన్న చర్చి మందిరంలో ఉన్న ఓవెన్ ఎంత పెద్దదంటే ఒకే సమయంలో వెయ్యి బ్రెడ్‌లను తయారు చేయవచ్చుట. తగిన బరువుండి మంచి నాణ్యత కలిగిన బ్రెడ్ ముక్కలను మాత్రమే అమ్మేవారట. వారు కనుక మోసం చేస్తున్నట్లు బయటపడితే భారీ జరిమానాలు, అవమానకరమైన శిక్షలు వంటివాటిని వాళ్లు ఎదుర్కొవలిసి వచ్చేది!



పార్కర్ హౌస్ రోల్ అనేది బోస్టన్‌లోని పార్కర్ హౌస్ హోటల్ మొట్టమొదట తయారుచేయబడిన బ్రెడ్ రకం. డికెన్స్, లాంగ్‌ఫెలో, ఆఫన్‌బ్యాచ్, నతానియల్ హాతోమ్ వంటి ప్రముఖులతో సహా పలువురికి ఇది ప్రీతిపాత్రమై ఇప్పటికీ అలరిస్తోంది. వార్డ్ అనే జర్మన్ వంటమనిషి ఒకసారి అతిథి దుష్ప్రవర్తనకు విసిగిపోయి, పూర్తికాని బ్రెడ్ ముక్కలను ఓవెన్‌లోకి అలాగే విసిరివేశాడట. అది పఫ్ లాగా తేలికగా మారి రుచికరంగా ఉండిందట. అంతే దీనికి ఎక్కడ లేని ప్రజాదరణ లభించేసింది!

ఆసక్తికరమైన బ్రెడ్ రకాలు:



మంకీ బ్రెడ్ అనేది మృదువైన బంగారు గోధుమరంగులో ఉండే బ్రెడ్. ఇది జిగటగా ఉంటుంది. చేతులకు కళ్ళకు పట్టుకుంటే ఇది వదలదు. దీన్ని కోయడానికి బదులుగా ప్రజలు కొంచెం కొంచెంగా లాగుతుంటారు లేదా గుంజుతుంటారు. అందుకే దీన్ని కోతి బ్రెడ్ అని అన్నారేమో?

అరటిపండు బ్రెడ్లను 20వ శతాబ్ది ప్రారంభంలో తొలిసారిగా ప్రవేశపెట్టారు. సరుకుల దుకాణాల్లో బాగా మాగిన అరటిపండ్లు గోధుమరంగులోకి మారటంతో వీటితో బనానా బ్రెడ్‌లను చేయడం మొదలెట్టారు. అలా అరటిపండును వృధాకాకుండా చేశారు.



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | I have passed my 12th Std. | I studied very hard. |
|---|---|---|
| Telugu | నేను ఇంటర్ పాస్ అయ్యాను. | నేను కష్టపడి చదివాను. |
| Hindi | मैंने १२वीं कक्षा पास कर ली है।<br>మైనె 12వీన్ కక్షా పాస్ కర్ లీ హై. | मैंने बहुत कड़ी मेहनत की।<br>మైనె బహుత్ కడీ మెహనత్ కీ. |
| Tamil | நான் 12ஆம் வகுப்பில் தேறி விட்டேன்.<br>నాన్ 12 ఆమ్ వగుప్పిల్ దెరి విట్టేన్ | நான் மிகவும் சிரமப்பட்டுப் படித்தேன்.<br>నాన్ మిగవుమ్ సిరమప్పట్టుప్ పడితేన్ |
| Bengali | আমি ১২শ শ্রেণী উত্তীর্ণ হয়েছি।<br>ఆమి 12ష్ షరెని ఉత్తీర్ణో హో'యెచ్చి. | আমি খুব মন দিয়ে পড়েছিলাম।<br>ఆమి ఖుబ్ మొన్ దియె పొ'రెచిలామ్. |
| Marathi | मी बारावी पास झालो आहे.<br>మి బారవి పాస్ జాలో అహె. | मी खूप अभ्यास केला होता.<br>మి ఖుప్ అభ్యాస్ కెలా హో'తా. |
| Kannada | ನಾನು 12ನೇ ತರಗತಿ ಉತ್ತೀರ್ಣನಾಗಿದ್ದೇನೆ.<br>నాను 12నే తరగతి ఉత్తీర్ణానాగిద్దేనె. | ನಾನು ಶ್ರಮ ಪಟ್ಟು ಓದಿದ್ದೆ.<br>నాను శ్రమ పట్టు ఒదిద్దె. |
| Oriya | ମୁଁ ଦ୍ୱାଦଶ ଶ୍ରେଣୀ ପାସ୍ କଲି।<br>ముున్ ద్వాదశ శ్రేణీ పాస్ కలి. | ମୁଁ କଠିନ ପରିଶ୍ରମ କରି ପଢ଼ିଥିଲି।<br>ముున్ కఠిన పరిశ్రమ కరి పడితిలి. |
| Gujarati | મેં ૧૨મું ધોરણ પાસ કર્યું છે.<br>మెన్ 12ముం ధొరణ పాస కర్యున్ చ్చె. | મેં ખૂબ અભ્યાસ કર્યો.<br>మెన్ ఖూబ్ అభ్యాస కర్యొ. |
| Assamese | মই দ্বাদশ শ্ৰেণী উত্তীণ হলো।<br>మొయి ద్వాతక్ శ్రేణి ఉత్తీర్ణ హొ'లు. | মই মনপুতি অধ্যয়ন কৰিছিলো।<br>మొయి మొన్‌పుటి అధ్యయన్ కొ'రిసిలు. |
| Malayalam | ഞാൻ 12-ാം ക്ലാസ് ജയിച്ചു.<br>జ్ఞాన్ పంత్రండమ్ క్లాస్ జయిచు. | ഞാൻ വളരെ നന്നായി പഠിച്ചു.<br>జ్ఞాన్ వలరె నన్నయి పడిచు. |
| Santali | ᱤᱧ ᱑᱒ ᱪᱚᱱᱚᱜ ᱤᱧ ᱥᱟᱛ ᱠᱮᱜᱼᱟ।<br>ఇంజి 12 చనక్ ఇంజి సత్ కెగ్-అ | ᱰᱷᱮᱨ ᱢᱤᱠ ᱯᱚᱰᱷᱟ ᱟᱠᱟᱱᱟ।<br>డొమిక్ పధ్యా అకనా. |
| Sanskrit | अहं द्वादशकक्षाम् उत्तीर्ण:।<br>అహం ద్వాదశకక్షామ్ ఉత్తీర్ణః. | अहं बहु अधीतवान्।<br>అహం బహు అధీత్వాన్ |





| English | I got a gift. | It was beautiful. |
|---|---|---|
| Telugu | నాకు ఒక బహుమతి వచ్చింది. | అది చాలా బాగుండింది. |
| Hindi | मुझे एक तोहफ़ा मिला।<br>ముజె ఎక్ తొహ్ఫా మిలా. | वह सुन्दर था।<br>వహ్ సుందర్ థా. |
| Tamil | எனக்கு ஒரு பரிசு கிடைத்தது.<br>ఎనక్కు ఒరు పరిసు కిడైత్తత్తు. | அது அழகாக இருந்தது.<br>అధు అళగాగ ఇరుందదు. |
| Bengali | আমি একটা উপহার পেয়েছি।<br>ఆమి ఎక్టా ఉపాహార్ పెయిచి. | সেটা খুব সুন্দর ছিল।<br>సెటా ఖుబ్ సుందొర్ చిలో. |
| Marathi | मला एक बक्षीस मिळालं.<br>మల ఎక్ బక్షీస్ మిలాలం. | ते खूप सुंदर होतं.<br>తె ఖుప్ సుందర్ హోతం. |
| Kannada | ನನಗೊಂದು ಉಡುಗೊರೆ ಸಿಕ್ಕಿದೆ.<br>ననగొందు ఉడుగొరె సిక్కిదె. | ಅದು ತುಂಬಾ ಚಂದವಾಗಿತ್ತು.<br>అదు తుంబా చందవాగిత్తు. |
| Oriya | ମୁଁ ଗୋଟିଏ ଉପହାର ପାଇଲି<br>మున్ గొటై ఉపహార పాయిలి. | ଏହା ସୁନ୍ଦର ଥିଲା।<br>ఏహా సుందర్ తిలా. |
| Gujarati | મને એક ભેટ મળી.<br>మనె ఎక భెట మళీ. | તે સુંદર હતી.<br>తే సుందర్ హతీ. |
| Assamese | মই এটা উপহাৰ লাভ কৰিলো।<br>మొయి ఎటు ఉపహార్ లాభ్ కొరిలు. | এইটো সুন্দৰ আছিল।<br>ఇటు క్సుందర్ ఆసిల్. |
| Malayalam | എനിക്കൊരു സമ്മാനം കിട്ടി.<br>ఎనిక్కొరు సమ్మానమ్ కిట్టి. | അത് മനോഹരമായിരുന്നു.<br>అతు మనోహ రమయిరున్ను. |
| Santali | ᱥᱤᱨᱯᱷᱚᱜᱽ ᱟᱢᱮᱫ ᱟᱠᱟᱫ-ᱟ।<br>సిర్పక్ అమెత్ అకడ్-అ | ᱱᱚᱶᱟ ᱠᱚᱨᱚᱠ ᱛᱷᱟᱱ ᱠᱟᱱᱟ।<br>నోవ కొరోక్ థాన్ కనా. |
| Sanskrit | मया उपहार: प्राप्त:।<br>మయా ఉపహారః ప్రాప్తః. | उपहार: सुन्दर: आसीत्।<br>ఉపహారః సుందరః ఆసీత్. |

## శాఖాహారపు మొసలి



నమ్మండి, నమ్మకపోండి... కాని కేరళలో మీరు ఒక స్నేహపూర్వకమైన మొసలిని చూడవచ్చు. బబియా అనే పేరు గల మొసలి ఈ ఆలయాన్ని సంరక్షిస్తోంది. బబియా ఆలయానికి సంబంధించి స్థానిక సంరక్షకురాలు, వార్తాహరురాలు అని స్థానిక ప్రజల నమ్మకం. ఇది అన్ని ఉపద్రవాలను తొలగించి, ఆలయాన్ని, భక్తులను కాపాడుతుందట.

శ్రీ అనంతపద్మనాభస్వామి ఆలయం తొమ్మిదవ శతాబ్దం నాటిది. ఆలయ కొలనులో గత 60 సంవత్సరాలుగా ఈ మొసలి జీవిస్తోందని భావిస్తున్నారు. పండుగరోజుల్లో బియ్యం, జాగరీతో చేయబడిన ఆహారాన్ని బబియా కోసం ప్రత్యేకంగా చేస్తారు. ఈ మొసలి పూర్తిగా శాఖాహారి. ఇది ఏరకమైన మాంసాన్ని ఆరగించదట. ఎవరికీ హాని తలపెట్టదట. ఈ మొసలి చిరంజీవి అని దీనికి ఎన్నటికీ చావు లేదని ఇక్కడి ప్రజలు బలంగా విశ్వసిస్తున్నారు. కాలాంతం వరకు ఇది జీవిస్తూ ఉంటుందని వీరి నమ్మకం.

బబియాను చూడటానికే ఈ ఆలయాన్ని చాలా మంది సందర్శిస్తుంటారు.

## మనసుంటే మార్గముంటుంది

ముగ్గురు పిల్లల తల్లి భారతీదేవికి 40 ఏళ్లు. పశ్చిమబెంగాల్ జల్పాయ్‌గిరి జిల్లాకు చెందిన ఈమె తన కూతురుతో కలిసి 10వ తరగతి పరీక్షలకు హాజరవుతోంది. ఈమె ఒక బాలల విద్యాకేంద్రంలో పనిచేస్తోంది. ఆమె పదవ తరగతి చదువుతున్నప్పుడే తల్లితండ్రులు ఆమెకు పెళ్లి చేసేశారు. తర్వాత ఆమె చదవలేకపోయింది.



చదువు ఆపివేసి మెట్టింటిలో ఉండిపోవలసి వచ్చింది. కాని, సెకండరీ స్కూల్ పరీక్షలను పూర్తి చేయాలనే తన కలను ఆమె వదిలి పెట్టలేదు. 38 సంవత్సరాల తర్వాత ఆమె మళ్లీ పాఠశాలకు హాజరయింది. కూతురుతో కలిసి చదవటం ప్రారంభించింది. పదవ తరగతి పరీక్షలకు హాజరు కావడానికి తన పేరు నమోదు చేసుకుంది. ఆమె కూతురు సంచితకు కూడా పెళ్లయిపోయింది. ఈమెకూడా తన సెకండరీ స్కూలు పరీక్షలను పూర్తి చేయాలని నిర్ణయించుకుంది.

భారతి, మహిళా సాధికారతకు నిదర్శనంగా నిలబడుతూ పరీక్షలకు హాజరవుతోంది.

# విదూషకుడు

## బీర్బల్



# సరిహద్దులు లేని రాజ్యం



1. ఒకరోజు, చక్రవర్తి అక్బర్ తన దర్బారులో ఉన్న సంగీత విద్వాంసులపై ఆగ్రహించాడు. 'నా రాజ్యం వదిలివెళ్లండి! నా రాజ్య సరిహద్దుల లోపల మిమ్మల్ని నేను చూడాలనుకోవడం లేదు.'



2. ఆ దురదృష్ట సంగీత విద్వాంసులు అదే రోజు రాజనగరి వదిలి వెళ్లిపోయారు. వారు లక్ష్యం లేకుండా అనేక రోజులు అటూ ఇటూ తిరుగాడి తర్వాత విసిగిపోయారు.



3. 'ఇలా ఎటు బడితే అటు ఇకెంతకాలమో తిరగలేము. మళ్లీ రాజనగరుకు వెళ్ళిపోదా పద,' అన్నాడు ఒక విద్వాంసుడు. 'బీర్బల్‌ని కలుద్దాం. అతడు తప్పనిసరిగా ఒక దారి కనుక్కుంటాడు.' అన్నాడు మరొకరు.



4. వారు రాజధానికి రహస్యంగా వెళ్లి బీర్బల్‌ని కలిశారు. 'బీర్బల్ నువ్వే మా చివరి ఆశ.' అని వేడుకున్నారు. 'భయపడకండి నా పథకం తప్పకపనిచేస్తుంది.' అంటూ బీర్బల్ తన పథకాన్ని వారికి తెలియజేశాడు.



5. ఆ మరుదినం, బీర్బల్‌తో కలిసి వెళుతూ చక్రవర్తి, బీర్బల్‌తో కలిసి వాహ్యాళికి వెళుతూ ఆ ఇద్దరు విద్వాంసులనూ చూశాడు. వారు వెంటనే తమ పథకం ప్రకారం నటించారు.



6. వాళ్లను చూడగానే చక్రవర్తి ఆగ్రహోదగ్రుడయ్యాడు. 'ఇద్దరూ కిందికి దిగండి. నా ఆజ్ఞను ధిక్కరించడానికి ఎంత ధైర్యం మీకు?' వెంటనే వారిద్దరూ చెట్టు దిగారు.



7. 'షహెన్‌షా, మేము మీ రాజ్యం సరిహద్దు దాటి వెళ్లాలని ప్రయత్నించాము కాని మీ రాజ్యం ఎంత పెద్దదంటే దానికి ఏ సరిహద్దులూ లేవు.'



8. చక్రవర్తి సంతోషించాడు. 'అయితే మీరు చెట్టు ఎందుకు ఎక్కుతున్నారు?' అని అడిగాడు. 'ఆకాశం ఒక్కటే మిగిలింది. అందుకే మేము ఆకాశాన్ని చేరేందుకు ప్రయత్నిస్తున్నాము.' అన్నారు విద్వాంసులు.



9. చక్రవర్తి గట్టిగా నవ్వాడు. 'సందేహమే లేదు ఇది బీర్బల్ సలహాయే. నాకు తెలుసు. సరే సరే. మీ ఇద్దరినీ క్షమిస్తున్నాను. మీరు నా దర్బారుకు తిరిగి రావచ్చు.'

**మీకు తెలుసా?**

## వృక్ష కాలగణన



కాలగణన అధ్యయన శాస్త్రం. ఇది కాలంలోని ఘటనల అమరికను తెలిపేశాస్త్రం. కానీ మీకు డెండ్రోక్రోనాలజీ అనే పదం గురించి తెలుసా? ఇది చెట్టువయసును అధ్యయనం చేసే శాస్త్రం. చెట్ల వలయాలను అధ్యయనం చేసే శాస్త్రం. ఈ వలయాలు చెట్టు గురించిన అనేక విషయాలను మనకు తెలుపుతాయి. చెట్టు వయసు, దాని జీవితకాలంలో అది పొందిన వాతావరణ మార్పులు వంటి పలు విషయాలను ఈ వలయాలను అధ్యయనం చేయడం ద్వారా తెలుసుకోవచ్చు. చెట్టుకు హాని తలపెట్టకుండా దాని వలయాలను పరిశీలించడానికి శాస్త్రవేత్తలు కోరింగ్ అనే పద్ధతిని కనిపెట్టారు. చెట్టు యొక్క కోర్ శాంపిల్ గురించి తెలుసుకోవడానికి వీరు చెట్టు మొండెంలోకి ఒక రంధ్రంలోకి పరికరాన్ని చొప్పించి దాని వివరాలను రాబడతారు.

# సముద్రజీవులు

ఈ నెల సముద్రజీవులపై స్క్రాప్ బుక్ రూపొందిద్దాము.



నీటిగుర్రం



జెల్లీ చేప



సముద్ర మొక్క-జీవులు



సముద్ర తాబేలు



నక్షత్ర చేపలు



క్లౌన్ ఫిష్

CHANDAMAMA'S

# Ramayana

An Epic Journey






Follow the epic journey of Prince Rama, from his birth to his exile, from the abduction of his wife, Sita, to his great war with the Asura King, Ravana, in Chandamama's latest offering: Ramayana - An Epic Journey.

Price: Rs 449/-

To place an order, go to www.chandamama.com

Chandamama's Ramayana is available only in English at all leading book shops.

